# పద్మావతీ పరిణయము



రచయిత :

శ్రీ జి. యస్. పురుషోత్తమగౌడు

చిన్నటేకూరు, (కర్నూలు జిల్లా)

ప్రచారకర్త :

శ్రీ రామ మాధవరెడ్డి

# పద్మావతీ పరిణయము

రచయిత :

శ్రీ జి. యా. పురుషోత్తమ గౌడు

చిన్నపేకూరు, (కర్నూలు జిల్లా)

ప్రచార కర్త :

శ్రీ రామ మాధవ రెడ్డి

ప్రథమ ముద్రణ : 1992

పద్మావతీ పరిణయము

ప్రతులు : 2000

అమూల్యం :



ప్రతులకు :
శ్రీ జి. యూ. పురుషోత్తమ గౌడు
చిన్నటేకూరు పోస్టు
కర్నూలు జిల్లా
పిన్ 51813

ముద్రణ
ఏకాప్రింటర్సు, పాతగుంటూరు - 522 010
ఫోన్ : 20144

# కృతజ్ఞతలు

శ్రీ తిరుమల-తిరుపతి దేవస్థానము వారి
ద్రవ్య సహాయముతో ఈ గ్రంథము
ముద్రించడమైనది. వారికి నా
హృదయపూర్వకమైన
నమస్కారములు
అర్పించుకొను
చున్నాను.

# అంకితము



ఉ॥ శ్రీలకు నెల్ల టెంకియయి చెన్నెలరారెడు
చిన్న టేకూరున్
వేలుపులయ్యు నా కిలను పెంపెసలారగ జన్మనిచ్చి నన్
మేలిమి పెంచె నమ్మయును మేనునుయిచ్చిన తండ్రికిన్
సదా
శీలికి కావ్యమంకితము జేసితి మంగమయంగనాఖ్యకున్

( మరియు గురుదేవులకు )

ఆ॥ మద్దులేటి గురుడ మా యిలవేలుప
అద్దిరనగ నీకు ముద్దులొలికె
కావ్యకన్య నిత్తు కాంక్షతో నీకు నే
అంకితంబుగొనుము అంజలిడుదు

( మరియు మా యిలవేలుపునకు )

ఆ॥ శ్రీనివాస నీకు చిత్తశుద్ది నిపుడు
నవరసాల సాల నాదు కవిత
నర్పణంబుజేతు నంజలి ఘటియింతు
వేగ గొనుము నీవు వేంకటేశ

# పీఠిక

ఉ. నేనొక నాటి రాత్రి బహు నేర్పుగ జేసిన పిండివంటలన్
మానినితోడ హాయిగను మానసముబ్బగ మెక్కి-
తిచ్చగన్
జానయు ఆకులొక్కలిడ జాలిమితోడుత స్వీకరించి నా
మేనును కానసంత కడుమిక్కిలి నిద్రను జెందుచుండగా
వ॥ నట్టి సమయంబున

తే. మెరువు చెంగట నున్నట్టి మేఘమట్లు
నాదు కన్నులముందర నవ్వై నిలువ
గాఢనిద్రయందు ఘనుని గాంచినాడ
శంఖచక్ర గదాధరు శాంతు ననఘు

వ॥ అంత అమందానంద కందళిత హృదయుండనై, ముకుళిత కరకమలుండనై, సంకర్షణానుజు నంశంబగు శ్రీ వేంకటేశ్వరునకు ప్రణమిల్లి నిలువంబడ, నప్పుడు.

సీ. నీ తండ్రి యంగన్న నిరతంబు నిచ్చతో
పూజించె నపరంజి పూలచేత
నీ తల్లి మంగమ్మ నియమాన నా రాణి
సేవలు చేసియు చేరె దివికి
నీ భార్య వెంకమ్మ నిత్యంబు భక్తితో
పతిసేవలను జేయు పరమసాధ్వి
నీ సోదరులు బహు నీతికోవిదులయ్యె
యోగీశ్వరుడు బహు యోగ్యుడరయ

తే. యల్లగౌడును శేషయ్య యుల్లమలర
యెల్ల వేళల నా సేవ కొల్లలుగను
చేయుచుందురు మీ వారు చెలిమితోడ
గుంజపల్లె పునీతుడా గుణ విధేయ

తే. భైరవేశ్వర శతకంబు భక్తితోడ
రచన సల్పినాడవు బహు రక్తిగాను
యించుకంతయు నన్నును నెంచవయితి
నాదు కల్యాణమున్ చాటు నైజమొప్ప

వ॥ అని శ్రీనివాసుండు నా కలలో కనిపించి ఆనతిచ్చి కనుమరుగాయె. ఆ నాటినుండి పద్మావతీ పరిణయమను ఈ కావ్యము వ్రాయవలెననే కాంక్ష నాలో హెచ్చమి ఈ కావ్యము వ్రాయడమయినది. నా ఈ పుస్తకమును, నన్నును ఆశీర్వదించి, తన చక్కని సందేశ మిచ్చిన శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీగారు (విశ్వమందిరం, కృష్ణనగరు-గుంటూరు) వారికి హృదయపూర్వకాభివందనములు నర్పించడమైనది. మరియు స్వర్ణకారులు బంగారమునకు తేజాపు వేసిన ఎట్లు ప్రకాశించునో తద్విధంబుగా నా పుస్తకమును పరిశీలించి, అక్కడక్కడ వున్న నెరసులను ఛేదించి, నా పుస్తకమునకు మరింత వన్నె తెచ్చిన కవిగారు డా॥ ప్రసాదరాయ కులపతిగారు (ప్రిన్సిపాల్, హిందూకాలేజి-గుంటూరువారు) నాకు గురుతుల్యులు, గౌరవనీయులు. వారికి నే నెల్ల వేళల ముకుళిత కరకమలుండనౌదు.

మరియు నేను పని పాట చేయక, రచనాసక్తితో పర ధ్యాన మందుండిన విసుగున్ చెందక, ఈసడించుకొనక నీ సం కల్పము నెరవేర్చుకో, నీ రచన సాగనివ్వమని నన్ను ప్రోత్స హించి వుహమిచ్చిన నా భార్యామణి వెంకమ్మగారే ఈ రచ నకు ఒకరీత్యా కారకులౌతారు. మరియు బంధువు, బావమరది శ్రీ లం. నారాయణగౌడు, B A, (మోదుకూరు) నన్ను మరీ మరీ ప్రోత్సహించి నారచనకు, నాకు ఉత్సాహమిచ్చినవాడు.

మరియు ఈ కావ్యమును వ్రాయమని ప్రోత్సహించి, నన్ను కవనరంగంలో కాలిడజేసిన మిత్రులు, సహాధ్యాయులు, పెద్దలు, పూజనీయులు, గురుతుల్యులు- వీరిలో శ్రీ మాధవరెడ్డి సాధుగారు ఒకరు. నా పుస్తకమునకై ఎంతో శ్రమ ప్రయా సల కోర్చి పుస్తకము పరిశీలన చేయించి, ముద్రణకై కృషి చేసినవాడు. వారికి శ్రీశ్రీశ్రీ వేంకటేశ్వరుడు ఆయురారోగ్య ములు ప్రసాదించుగాక! మరియు నా పుస్తకము నామూలా గ్రముగ చదివి తన చక్కని అభిప్రాయము వ్రాసిన ఆకుల రామచంద్రుడుగారిని, సర్వదా కాపాడుమని శ్రీనివాసుని ప్రార్థన చేయుచున్నాడను. మరియు నా మిత్రులు యన్. రామాంజనేయులు, తెలుగుపండిట్ (కార్మంచి, చిన్నపేకూరు మాతృభూమి), బి. సుంకన్న, తెలుగుపండిట్-చిన్నపేకూరు, యన్. శ్రీనివాసులు(మోదుకూరు నియోజకవర్గం), గూడూరు- బెలగల్లు, యం. డి. ఓ. గారు (చిన్నపేకూరు మాతృభూమి), యస్. అబ్దుల్ సలాం, (సబ్ ఇన్స్పెక్టరు ఆఫ్ పోలీస్-బేతం చెర్ల) గారు, పులివెందకొండ గ్రామాధికారి వెంకోబరావు, పులివెందకొండ-బొల్లవరం యన్. రామానుజగౌడ్ గారున్నూ

పులింపకొండ యస్. కృష్ణమూర్తిగౌడున్నూ, చిన్నటేకూరు కె. కామేశ్వరరావున్నూ, టి. రామాంజనేయులు, కె. శేషగిరి, ఆర్. సుబ్బయ్యశెట్టి. యస్. పెద్ద సుబ్బరాయుడుశెట్టి, వీరందరు నాకు ఎంతగానో ప్రోత్సాహమిచ్చి, నన్ను ఈ అభేద్యమయిన కవనరంగములో కాలిడజేసిరి. వీరికి ఆ ఏడుకొండల వేంకటరమణుని సంకటముల బాపమని ప్రార్థించుచున్నాను. మరియు మా గ్రామ పెద్దలు యం. యల్లారెడ్డి, వకీలు, చిన్నటేకూరు గ్రామాధికారి యం. వెంకటేశ్వర రెడ్డి-చిన్నటేకూరు యం. శేఖర రెడ్డి-చిన్నటేకూరు- వీరున్నూ, నాకు తగిన ప్రోత్సాహమిచ్చి, మూడునామాలవాని కల్యాణము వ్రాయమనిరి. వీరిని ఆ ఏడుకొండలవాడైన వేంకటరమణుడు సర్వదా కాపాడుగాక!

నా పుస్తకము అందంగా, తప్పులులేకుండా ప్రింటుచేసిన ఏకా ప్రింటర్సువారికి నా ధన్యవాదములు.

మరియు నా ఈ కావ్యములో ఎన్నియో తప్పులు వుండవచ్చు. వాటన్నిటిని క్షమింతురని మిమ్ముల ప్రార్థేయపడుతున్నాను నా పుస్తకమందు తప్పులున్న, అవి నాకు తెల్పిన ద్వితీయముద్రణనందైన దిద్దుకోగలనని మిమ్ముల ప్రార్థించుచున్నాను.

ఇట్లు
గ్రంథకర్త
జి.యా. పురుషోత్తమగౌడు
చిన్నటేకూరు
కల్లూరుమండలం, కర్నూలుజిల్లా

ఓం శ్రీ సాయిరాం గురుదేవదత్త



# ఆశీస్సులు

— శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ

కలియుగదైవం వేంకటేశ్వరుడు. ఆపదమొక్కుల వానిగా, అడుగడుగు దండాల వానిగా, పిలిచిన పలికే దైవముగా శ్రీ వేంకటేశ్వరుడు జగత్ప్రసిద్ధమై వెలుగొందుతున్న విషయము అందరికీ అనుభవైకవేద్యమే. వేంకటేశ్వరుడు- శ్రీనివాసుడు, సకల అరిష్ట నివారకుడు, అభయ ప్రదాయి, ఆనందదాయి. పద్మావతీ శ్రీనివాసుల కల్యాణగాథ అందరికీ చిరపరిచితమే, జగత్ప్రసిద్ధమే. అట్టి గాథను "పద్మావతీ పరిణయము" అను పేరుతో కర్నూలు జిల్లా, చిన్నటేకూరు వాస్తవ్యులు శ్రీ G. E పురుషోత్తమగౌడు మనోహర కావ్యముగా చిత్రీకరించి రంగులు దిద్దినాడు. శ్రీనివాసుని గాథను ఎందరు ఎన్నిసార్లు ఎన్నెన్ని రీతుల ప్రకటించిననూ ఆనంద దాయకమూ భక్తిప్రదాయకమూ అయి మనసులను భక్తిభావముతో ఉర్రూతలూగించును.

ఇట్టి భక్తిపూరిత కావ్యమును సమాజమున కందించిన పురుషోత్తమగౌడునకు ప్రథమముగా నా ఆశీస్సులందించు చున్నాను.

ఈ పుస్తకమును ముద్రీకరించుటలో ఎంతో శ్రమకు ఓర్చి సహాయము నందించిన సాధు శ్రీరామ మాధవరెడ్డికి నా ఆశీస్సుల నందించుచున్నాను.

తక్కువకాలములో మనోహరముగా ముద్రించి ఇచ్చిన ప్రెస్‌వారు, వారి సిబ్బందికీ నా ఆశీస్సులు.

భక్తిరసపూరితమైన ఈ కావ్యమును ఆంధ్రపాఠకలోకం సహృదయంతో సమాదరణ చూపగలదని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ ఆశీస్సుల నందిస్తున్నాను.

**27-10-92** శ్రీ విశ్వయోగి విశ్వంజీ
విశ్వమందిరం
కృష్ణనగర్-గుంటూరు

శ్రీ సద్గురువేనమః

# అరవిందం

గౌ॥ శ్రీ జి. ఋ. పురుషోత్తమగౌడుగారు తమ యసాధారణ కృషితో రచించిన ఈ పుస్తకమునకు నేను నా అభిప్రాయమును వ్రాయుటయు యెట్టిదనఁగా స్వతఃప్రకాశకునకు దివ్వెవంటిది అయినను పూజ్యులు శ్రీ గౌడుగారి కార్యమని యెంచి యికార్యమున కంగీకరించితిని.

శ్రీ "పద్మావతీ పరిణయము" అను గ్రంథమును ఆమూలాగ్రముగ పఠించితిని. సర్వవిధముల ప్రశస్తమైన యీ గ్రంథము అందరుఁ జదువదగినది. సులభశైలి రచనతో యీ వారిజనేత్రుని చరిత్రము రసయుతముగా వర్ణించినందులకు అత్యంత సంతుష్టాంతరంగుడనైతిని.

మీ ఈ గ్రంథము పాఠకభ్రమర బృందానికి భక్తి మకరంద సంభరిత అరవిందం. ఈ అనురూప భగవద్భక్తి అనంతమై అపార పాపపుంజమును హరించి వారికి జరామరణ రాహిత్య మొసంగుచు భక్తి యుతమైయెప్పు నీ కావ్యమాంధ్ర భారతి కంఠహారమున నొక యమూల్య రత్నమై వెలుగొందుగాఁక!

కృతికర్తకు నా మనఃపూర్వ కాభివందనము లర్పించుచున్నాను. సర్వేశ్వరుడు వీరికి చిరాయురారోగ్యఐశ్వర్యాది సంపత్తిని, సత్ప్రచార ఇతోధిక గ్రంథ రచనా సామర్థ్యమును ప్రసాదించి నిరంతరము ప్రోత్సహించుచుండుగాక యని నా ప్రార్థన.

ఇట్లు,
ఆకుల రామచంద్రుడు
చిన్న పేకూరు

డాక్టర్ ప్రసాదరాయ కులపతి
శ్రీనాథపీఠ నిర్వాహకాధ్యక్షులు
ప్రిన్సిపాల్, హిందూకాలేజి
గుంటూరు

కర్నూలుజిల్లా చిన్నతేకూరుగ్రామ వాస్తవ్యులు శ్రీపురుషోత్తమగౌడు ఆధ్యాత్మిక సాధన చేయుచున్న ఉత్తమ సాధకులు. విశేషించి నాకు మిత్రులు, ఆప్తులునైన ఏకా రాజేశ్వరరావుగారికి కావలసినవారు. పద్మావతీ పరిణయమును చంపూకావ్యముగా రచించి దేవతారాధనము గావించి భక్తిమార్గమున ముందడుగు వేసినాడు.

భక్తిప్రధానమైన రచనలలో కవి ఉద్దేశమును గమనింపవలసియుండును. రచనలో ఉండవలసిన కావ్యలక్షణములు సాహిత్యశాస్త్రముప్రకారము పరిశీలించుటకంటె భక్తి ఎంత ఉద్దిష్టమగుచున్నదో, వ్యక్తమగుచున్నదో పరికించుట భావుకుల కిష్టముగా నుండును.

ఆలోచన పట్టని ఆవేదన, శబ్దమును గమనించని పారవశ్యము. అర్థమును వీక్షింపని ఉద్వేగము భక్తిభావుకుల తత్వము గౌడుగారిలో ఈ లక్షణములున్నవి. ఇటువంటివారి కవితాప్రయత్నములు ఎంతయు మెచ్చదగినవి. శ్రద్ధ, ఆసక్తి భారతీ పాదపద్మముల ఆరాధన వీరిని ప్రశంసనీయులైన వ్యక్తులను చేసినది. ధారాళమైన శైలి, ప్రసన్న పదప్రయో

గము, సులభసుందర వచో విన్యాసము, సుబోధకమైన అర్థ నిర్మాణము వీరి కవితాలక్షణములుగా కన్పడుచున్నవి. వీరి సౌజన్యము, వినయము, కవితాప్రవృత్తి నన్ను ఆకట్టుకొన్నవి. పద్మావతీ వేంకటేశ్వరులు కరుణామయులై ఈ భక్తిమార్గీయుడైన రచయితను కటాక్షింతురుగాక! ఈ సరస్వతీవరివస్య లోకాదరణీయ మగునుగాక!

ప్రసాదరాయకులపతి

12–11–92

పలకలూరి శివరావు
శ్రీశ్రీశ్రీ అబ్బూరి
నారాయణస్వామి ప్రియశిష్యులు
సంఘసేవకులు

మాన్యమహోదయులు, రచయిత శ్రీ G.E. పురుషోత్తమ గౌడుగారికి నా హృదయపూర్వకమైన నమస్సుమాంజలి. ఉభయకుశలోపరి.

మీ సంపాదకత్వమున వెలువడిన "పద్మావతీ పరిణయము" కావ్యము దైవభక్తి పరులు, మిత్రులు శ్రీ మాధవ రెడ్డిగారి ద్వారా అందినది. గ్రంథమును ఆమూలాగ్రం పఠించాను. ఆనందముతో హృదయం స్పందించింది. కావ్యం సర్వాంగసుందరంగా వుంది. ప్రతి పద్యం ఒక చెఱుకు కణుపులా-జున్నుముక్కలా పాఠకుల హృదయాన్ని ఆకట్టుకుంటుంది. పండిత పామరులకు, ముముక్షువులకు సైతము కరదీపిక వంటిది. ఈ గ్రంథము చదివిన ప్రతివారికి దైవభక్తిపై విశ్వాసము కలిగి ఆధ్యాత్మిక చింతన కలుగజేయును.

మీరు గావించిన కృషి అత్యంత ప్రశంసనీయము. భక్తి, రస, సంప్రదాయ పోకడలతో రూపొందించిన మీ కావ్యం అపూర్వం. ప్రస్తుత పాఠకలోకమునకు వరప్రసాదం. పవిత్రమైన పురాణకావ్యమిది. మీ కావ్యం చదివిన ప్రతివారు ధన్యజీవులు.

ఈ కావ్యం ప్రచురణ కావించుటకు మీకు అనుజ్ఞ. అడుగడుగునతోడ్పడుచున్న సహృదయులు మాన్యశ్రీ శిరామ మాధవరెడ్డిగారి కృషి అత్యంత ప్రశంసనీయము.

శ్రీ పద్మావతీసమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారు మీకు సంపూర్ణ ఆయురారోగ్య ఐశ్వర్య భాగ్యములను ప్రసాదించవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాము.

భవదీయులు

గుంటూరు

పలకలూరి శివరావు

పలకలూరి రత్నకుమారి

# కృతజ్ఞత

తే॥ తిరుమల తిరుపతందున ధీర నీవు
కార్య నిర్వాహకారివై కాంక్షతోడ
వేంకటేశ్వర సేవలో వెలసి తౌర
సాటిలేరె ప్రసాదుకు సత్య మిద్ది

ధర్మపరులు సహృదయులు విద్యా వేత్తలు, విద్యాభిమానులు, శ్రీ యం. వి. ఎస్. ప్రసాదు తిరుమల తిరుపతి దేవస్థానము కార్య నిర్వహణాధికారి, నా క్రుషికి సంతసించి నా గ్రంథమునకు వుదార స్వభావముతో ఆర్థిక సహాయము చేసి నందులకు నేను సర్వదా కృతజ్ఞుడను.

ఆ॥ విశ్వ మందునీవు విజ్ఞాని వయ్యును
విశ్వయోగి యనగ వినుతి కెక్కి
విశ్వ మందిరాన వెలసి నాడవు స్వామి
విశ్వయోగి నిన్ను వినుతి జేతు

పూజ్యులు గురుదేవులు శ్రీ శ్రీ శ్రీ విశ్వయోగి విశ్వంజీ మహాయోగి పుంగవులు ఆధ్యాత్మిక వేత్తలు. యీ మహా తపస్వి నా గ్రంథమునకు, నాకు, తమ ఆశీస్సుల ప్రసాదించి తన కమ్మని మృదు మధుర అమృత ధారవంటి తన గంభీర వాక్కులచే ప్రవహించు వారి చక్కని అభిప్రాయము లిఖించి నందులకు విశ్వయోగీంద్రులకు నేనెప్పుడు వినమ్రుడనై వారి పాదసేవా భాగ్యము ప్రసాదించుమని వేడుచున్నాను.

ఆ॥ నాదు పుస్తకంబు సయమార చదివియు
తప్పులన్ని దిద్ది మెప్పు జేసి
వన్నె బెట్టి కావ్య కన్యగ జేసితే
నెన్న నౌనె నిన్ను సన్నుతింతు

నాదు కావ్యమును పరిశీలించి, అందుండ బడిన దోష ములు చేధించి బంగారమునకు తేజాపు కంసలి వాడు వేయ యెట్లు ప్రకాసించునో తద్విధంబుగా నా పొత్తమునకు వన్నె పెట్టి ప్రకాసింప జేసిన డాక్టరు ప్రసాదరాయ కులపతి గారికి నేనెంతో రుణపడివున్నాను. వారికి నాహృదయ పూర్వకాభి వందనము లర్పించుచున్నాను.

మరియు

నా పుస్తకము చక్కగా అందంగా తప్పులు లేంకుడ ప్రింటు చేసి సకాలమునకు అందించిన ఏకా ప్రింటర్స్ వర్కర్సుకు ఆ యేడుకొండల వేంకటరమణుడు ధనకనక వస్తు వాహానములు ఆయురారోగ్యముల నిచ్చి, కాపాడమని వేడుచున్నాను.

రచయిత :

జి. యా. పురుషోత్తము గౌడు

# ప్రచారకర్త వంశావళి

సీ|| శ్రీరామ వంశ సచ్ఛీలుండు సంజీవ
రెడ్డి కర్ధాంగియు ప్రీతి మతియు
యెల్లమ్మ కిష్టుడై యమరెడు పుత్రుండు
మాధవరెడ్డియె మహిని వెలసె
యిల్లపుటల్లుడై యింపుగా పెండ్లాడె
పెద్దభార్య శివమ్మ ముద్దులలర
గర్భంబు ధరించి కనె నొక బిడ్డను
శిశువును విడనాడి జేరె దివికి

తే.దీ. ప్రీతిగా పార్వతమ్మను పెండ్లియాడె
తీర్థమాడిన వెంటనే దివికి నరిగె
ప్రథమసతి బిడ్డ బుగ్గమ్మ రహిజెలంగె
సతులు మృతిజెంద వెంటనే సన్యసించి

తే.దీ. తీర్థయాత్రలు సేవించి ధీరుడగుచు
సత్పీఠుల దరిజేరి సగుణుడయ్యె
కావ్యముల నచ్చువేయించి భవ్యముగను
యిచ్చి యాయురారోగ్యముల్ యీశ్వరుండు.

# దైవప్రార్థన

ఉ॥ మ్రొక్కు లొనర్తు కేల్ ముడచి మోదకహస్తుని యేక దంతునిన్
యెక్కుడు బొజ్జయున్ కలిగి యిమ్మగు చొక్కపు కొక్కునెక్కియున్
చక్కని పిండివంటలును సమ్మతి మెక్కెటి విఘ్నరాయ నిన్
మక్కువతోడ గొల్తు యెదమాటికి మాటికి భక్తితోడుతన్

చం॥ సిరులకు మున్కయై హొయలు చెన్నెలరారెడు వెండికొండపై
గిరిధరు నిన్ను గొల్వగను గీష్పతి ముఖ్యులు సేవజేయ తా
సరుదుగ గట్టుపట్టియును నారద తుంబుర గాన వీణలన్
నిరువుగ వింటు ముజ్జగము నేలెడు తేనెల తొల్పు గొల్చెదన్ !

ఉ॥ అమ్మవుమాకు నీవెకద యాదరమొప్పగ జేరదీయు మో
యమ్మ దయారసంబు గొను యారడి బెట్టకు మమ్మ వాక్పతీ
యిమ్ము సుశబ్దముల్ పలుకు లిందిర గాదిలికోడ లింక నా
కమ్మని కావ్యమింపలరగా దయజూడుము శారదాంబరో!

ఓం

# పద్మావతీ పరిణయము



## ప్రథమాశ్వాసము

శా. శ్రీవైకుంఠపురంబసంగ నిలలో శ్రీ వేంకటాద్రిన్ ప్రజా
సేవారాధ్యుడ వైతివీ వసుధపై శేషాద్రివాసా! దయన్
రావే! నా కవనంబు నింపలరగా రాణింప జేకూర్చు మా
నీవే దిక్కని వేడినాను సతమున్ నే నిన్ను ప్రార్థించితిన్

వ॥ అని యిష్టదేవతా ప్రార్థనంబు గావించి శ్రీల కాల వాలమై వెలుగు నైమిశారణ్యంబు నొండు కలదు. అందు సూత మహాముని తన శిష్యగణ సమేతంబుగా నివసించు చుండిరి. తన శిష్యులకు నిత్య మనేక పురాణేతిహాస పుణ్య కథలు చెప్పుచుండిరి. ఒకనాడు సర్వగుణ సంపన్నుడు, లీలా మానుష విగ్రహుండు భక్తవత్సలుండైన శ్రీమన్నారాయణుని గాథలు వినుచు, పాడుచు, తన్మయత్వము నొందినారు సూత మహాముని, శౌనకాది మహామునులు. పరవశులై పొయ్యారు. అట్టి సమయంబున సూతమహాముని యిట్లు చెప్పదొడంగెను.

తే.గీ. వేంకటేశు వివాహంబు పొంకముగను
చెప్పదొడగెను సూతుడు, శిష్యతతికి
వీనుదోయికి విందుగా వినిరి వారు
శ్రీనివాసుని గాథ ప్రసిద్ధ చరిత.

వ॥ నాతునలారా! శ్రీమన్నారాయణుడే వేంకటేశ్వరుండై వెలసినాడు. ఆ మహానుభావునే శ్రీనివాసుడనియు, ఏడుకొండలవాడనియు, వడ్డికాసులవాడనియు, హరిహరచిహ్న సమేతుండై, వేంకటాద్రిపై నీ కలియుగంబులోన వెలసియున్నాడు. అమ్మహా నగమే వృషభాద్రి, వేంకటాద్రి, గరుడాద్రి ఇత్యాది సప్తనామములు కలిగియున్న తిరుమలపై ధర్మసంస్థాపనార్థమై, ఆపద్బాంధవుడు, అనాథరక్షకుండునయిన నమ్మహావిష్ణుండు, లోకకళ్యాణార్థంబయి నవతరించి తన్ను నమ్మినవారి కోర్కెలు తీర్చుచుండునని చెప్పెను.

తే.గీ. విష్ణు వెందుకు భూమిపై వెలసినాడు
ఏమి కారణమున నగ మెక్కినాడు
ఏల పెండ్లాడె శ్రీ పద్మ నెలమి మీర
సర్వ మెరిగింపుమో సత్య సాధుశీల!

వ॥ అని శౌనకాది మహామునులు సూతమహర్షి నడుగ సూతు డిట్లు జెప్పదొడంగె.

తే.గీ. సత్యలోకాధిపతి బ్రహ్మ చారుమతిని
విశ్వ సంతాపహరణంబు వేడ్క బూని
సకల దేవ మునిగణాది సభను దీర్ప
దివ్య నంపగ నలరారె విబుధవేది.

వ॥ ఇట్లు సిద్ధ, సాధ్య, కిన్నెరులు విస్తృతముగ వచ్చు చుండ

తే.గీ. పాక శాసను డుత్సాహ పడుచు వేగ
దేవగణముల గూడి సంతృప్తి దీర
తెల్ల యేనుంగు పైనెక్కి ధీమతుండు
సత్యలోకము విచ్చేసె సత్వరముగ.

వ॥ ఇవ్విధంబున విచ్చేసి నాగంతకులు చతుర్ముఖునకు నమస్కరించి, యాశీర్వాదములనంది యుపవిష్టులైరి. తదనంతరంబున సభ్యులెల్ల నిష్టాగోష్ఠి సలుపుచుండియు, శ్రీమన్నారాయణుని ఘనత వర్ణింపసాగిరి. అట్టి సమయంబున విరించి సభ నుద్దేశించి తన సందేహం బీ రీతి దెలుపసాగెను. ఈ కలియుగంబున సర్వలోక సంరక్షకుడు, పాప సంహారకుండైన శ్రీమన్నారాయణుని యవతారము లేనందున మానవులు పాప భారంబుచే క్రుంగుచురు ఈ తరుణంబున సర్వ హితార్థమై హరి పునః భూలోకమం దవతరింపవలసి యున్నదని తెలుపు చుండ.

కం. వచ్చెను నారదు డా సభ
మచ్చికతో కలియజూచి మౌనులకెల్లన్
ఇచ్చ దలిర్పగ మ్రొక్కెను
లక్ష్మీకుమారుడు నలువకు ప్రణతు లొనర్చన్

వ॥ ఇట్లు సభాసీనులయి యున్న తల్లిదండ్రులకు నమస్కరించి నిలువంబడిన నారదుని రాక యందర కానంద

మాయెను. అప్పుడు నలువ నారదు నాలోకించి నారదా! ఈ కలియుగమున శ్రీ మహావిష్ణువు అవతరించు మార్గ మాలోచింపుము. ఇది దైవకార్యముగా నెంచుము. ప్రస్తుతము కలియుగ మారంభమగుచున్నది. శ్రీమన్నారాయణుడు యోగనిద్రలో యున్నాడు గాన నమ్మహాత్ముని మేలుకొలిపెడి బాధ్యత నీపై నున్నదనగా నారదుండు సంతుష్టాంతరంగుడై తన కీ యదృష్టావకాశము కలిగించినందులకు సంతృప్తుడై తండ్రియాజ్ఞ శిరోధార్యముగా నెంచి నమస్కరించి విరమించెను. సభానంతరము ఎవరి నివాసములకు వారు వెళ్ళిరి. కాలక్రమంబున

తే.గీ. నీతినియమాలు ధర్మంబు గోలి మునిగె
క్రూరహింసలు స్వార్థ మపారమయ్యె
నంతరించె న్యాయము కలి యావహించె
మాయలోబడి స్థిరము కాయమనుచు
దైవచింతన మానియు ధరణియందు
కీడు తలపెట్టు చుండ్రు నికృష్టజనులు

వ॥ అయ్యవసరంబున బ్రహ్మర్షులందరు కలిసి కలిపురుషుని శాంతికై గొప్ప యాగము జేయ సంకల్పించిరి. యాగమునకు సప్తర్షులు వారి శిష్య ప్రశిష్య సమేతముగ విచ్చేసిరి. అప్పుడు యాగ సందర్భమున ఋషుల వ్యాగ్రూప వేద మోద నాదంబులు మిన్నుముట్టుచుండ యాగమంటపమునుండి వెడలు హోమ ధూమ మాకాశమును కప్పివైచు సమయంబున త్రిలోక సంచారి

ఉ. గ్రన్నన వీణమీటుచు నిరంజన గానవిలోలుడై హరిన్
సన్నుతి చేయు నారదుడు శారద ముద్దులపట్టి వచ్చె నా
పన్నుల యాగమంటపము భక్తజనాళికి భూషణంబు గా
కిన్నెర సిద్ధ సాధ్య చయ ఖేచరసంయుత యాగశాలకున్

వ॥ ఇట్లు వచ్చిన నారదునకు ప్రణతులొనర్చి, మీ రాక మమ్ముల నానందసాగరమున ముంచినది. యింతవరకు నెవరు చేయని యీ యజ్ఞము కోరిన కోర్కెలు దీర్చుననుటలో సందేహంబు లేదు. దేవర్షులైన మీరాకవల్ల కలుగు భాగ్యముకంటె వేరు భాగ్యము కలదా యని నుతింప నారదుం డిట్లనియె.

తే.గీ. మౌని పుంగవులార! సన్మాన్యులార!
నిగమ నిష్ఠాత్ములార! పునీతులార!
భక్తమందార సుజ్ఞాన భాగ్యులార!
యాగధర్మాన సౌభాగ్య యోగమబ్బె

కం. మీరీ యజ్ఞఫలంబును
కూరిమితో నెవరి కీయ కోరిక గలదో
నోరిమి దెలుపంగ వలయు
నేరుపుతో సకల భువన సీమం బొప్పన్

తే.గీ. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల్ ప్రముఖులనగ
వీర లెవ్వరును ఘనులు విమలమతిని
యుక్తి యుక్తంబుగా బుద్ధి యోగమరసి
యజ్ఞకర్తను ఎన్నుడీ యనఘులార

వ॥ ఇట్లానతిచ్చి నారదమహర్షి నమో నారాయణా యంచు యజ్ఞశాలనుండి నిష్క్రమించెను. అప్పుడు సప్తర్షు లెల్లరు మార్గాంతర మెరుగక నివ్వెరబోయిరి. విష్ణువు ఘను డని కొందరు, బ్రహ్మ సృష్టికర్త, ఘనుడని మరికొందరు ఎవ రికి తోచినట్లు వారు పరస్పర వాగ్వాదము సలుపు సమయం బున భృగుమహర్షిట్లు పలికెను. నాయనలారా మనలో మనము తగవులాడుకొనుట యోగ్యము గాదు. ఈ సందేహసమాచార మును నేనే స్వయముగా పరిశీలించి వీరిలో నెవ్వరు ఘనులో తెల్పి చెప్పెదనని వాగ్దానము జేసి సత్యలోకమునకు వెడలి పోయెను.

మ.కో. సత్యలోకమునందు వాక్పతి స్రష్టతో సరసంబుగా
సత్యశీలుని శాంతినేతను సంస్తుతించుచు నుండగా
నిత్యమున్ హరి సన్నుతించెడి నీలవర్ణుని లెంకయున్
సత్యమున్ తెలియంగ వచ్చెను సత్వరంబుగ
మౌనియున్

వ॥ అకాలాగంతుక మౌనిని గాంచి బ్రహ్మ కోపముతో తన యాజ్ఞ లేకయే లోపలికి ప్రవేశించినందులకు భృగువు నిటనియె.

తే.గీ. ఘనుడ నేనంచు మా యాజ్ఞ గణుతిలేక
కన్ను మిన్నును గానక కావరమున
దుర్మదుడవయ్యి చొచ్చితి ధూర్తమతివి
తమరు చేయవచ్చునె యిట్టి తప్పిదంబు

వ॥ అని హాటకగర్భుండు మహర్షిని అధిక్షేపింప భృ
మహర్షి కోపఘూర్ణిత మానసుండై

కం. గర్వము మాయెడ చెల్లదు
సర్వము కోల్పోయెదవోయి శారదపతి! నీ
పర్వము ముగియంగ గలదు
శర్వాణీ పతికి నయినను జంకము యేమున్

వ॥ అని నీకు ఈ భూలోకంబున గుడి గోపురములు లే
పూజాపరహితుడ వౌదువుగాక యని శాపంబిడి నేరుగా కైలా
ముం జేరబోయెను.

సీ. కైలాసగిరిమీద గిరిజాకరగ్రాహి
కేళీ విలాసిత క్రీడసల్ప
నొసట విభూతిని పొసగ శృంగారించి
మిసిమి నొప్పారిన మీసమొప్ప
ఫాలభాగంబున ప్రజ్వరిల్లెడి నేత్ర
ముదయభానుని భంగి మెనలుచుండ
తలపైన చంద్రుండు కలకల లాడంగ
సిగనెక్కి గంగమ్మ చిందులేయ

గీ. పన్నగేంద్రుడు హారమై పడగబట్టు
భూతగణములు నుతియింప భూతలముల
గజ్జె కట్టిన రౌద్రుండు గర్జనలను
నృత్య మొప్పారె తాండవ నేత గరిమ

వ॥ ఇట్లు క్రీడించుచుండ భృగుమహర్షి నందీశ్వరుండు ద్వారంబున నివారించిన నిలుపక ఈశ్వరుని అనుజ్ఞ లేకుండ తన హృదయంబున గౌరీమహేశ్వరుల నిల్పుకొని నేరుగా లోపలికి ప్రవేశించెను. భృగుమహర్షి రాకకు ఈశ్వరుం డుగ్రుండై ప్రళయకాల భైరవుండాయెను.

మ. ఘన యోగీంద్రుల మంచు గర్వమున లోకాధీశులన్
గానకన్
వినయం బెమియు లేకనే పటిమతో విజ్ఞానినం చొప్పనే
వినుమా మౌనులకు న్నిటుల్ పలువ నీ పీచంబడంతున్
ఇక
న్వీను నే తెవ్వెద వేగమే జనుమికెన్ నిన్నే హతం
బార్చెదన్

వ॥ భృగువు నిర్లక్ష్య వైఖరితో నిల్చుండగా ఈశ్వ రుండు శూలంబు మౌనీంద్రునిపై వేయంబూన పార్వతి అడ్డు వచ్చి నివారించగా అప్పుడు భృగుమహర్షి ఈశ్వరుండు తామ సుండని యెంచి భూలోకములో నీ విగ్రహమునకు పూజలు జరు గక నీ లింగమునకే పూజలు జరుగుగాక యని శపించి సత్వర ముగా వైకుంఠముం జేరబోయెను.

సీ. వైకుంఠపురమందు వైనతేయాదులు
శ్రీహరి పూజలు చేయుచుండ
పాలకడలిలోన పన్నగశాయికి
ఫణిరాజు పదినూర్ల ఫణములార్చ

ఇందిరా సాంగత్య మింపారుచుండగా
భక్తాదు లెల్లరు భజన సలుప
మణిమయ కుండల మాణిక్యకాంతుల
తలపై కిరీటంబు తళుకుమనగ

తే.గీ. పన్నగేంద్రుడు అప్పుడు పాహి పాహి
యంచు క్షీరాబ్ధి శయను సర్వాత్మగొలువ
సచ్చిదానంద సాకార సద్గుణుండు
యోగనిద్రా నిమగ్న సద్యోగుడగుచు

వ॥ అప్పుడు భృగువు ప్రకటా భ్రూభ్రుకుటి వికటాట్టహాసంబున ప్రళయకాల భైరవుండునున్ బోలె వైకుంఠమున కేగి విరాట్ స్వరూపునిగని

తే.గీ. అపుడు మునిశేఖరుడు మహాపంతమొప్ప
పాలకడలిలో పన్నగు పాన్పుపైన
పవ్వళించిన శ్రీహరి పద్మనయను
మత్తుడై తన్నె నురము నున్మత్త మతిని

వ॥ అప్పుడు ముల్లోకంబుల కల్లోలములు రేగ, దిగ్గజంబులు దిక్కులుగానక ఘీంకార నినాదంబుల బరుగులిడను, దిక్పతులు తేజోవిహీనులై అసహాయావస్థ నల్లాడుచు, తలలువాల్చ భూమ్యాకాశంబుల హా! హా! కార నాదంబులు ప్రజ్వరిల్ల శ్రీ మహావిష్ణువు దిగ్గున లేచి భయభ్రాంతులు నటించుచు గద్గద స్వరంబున వినయ భాషిత మందహాసముతో నిట్లనియె.

సీ. హే మునిచంద్రమా! హే కరుణాకరా!
హే యోగిపుంగవా! హే తపస్వి
హే సుగుణాత్మకా! హే మునిచంద్రమా!
హే త్రినేత్రాయతే! హే సుశీలా!
హే బ్రహ్మపుత్రక! హే త్రికాలజ్ఞాత!
హే కమండలధర! హే మహాత్మ!
హే ముజ్జగారాధ్య! హే దీర్ఘతర జటా!
హే త్రిపూర్ణ లిఖిత హే మునీశ
తే.గీ. నా కటుయురంబు దీవ్రత తాకి నీమ్మ
మపద మెంత నొచ్చెనోగదా దోషము క్షమి
యింపుమని పాదముల బట్టి యుంపగ నరి
కాల జ్ఞాననేత్ర ధ్వంసకారియయ్యె

వ॥ ఇట్లు జ్ఞాననేత్రంబును పాదంబు లొత్తుచు అదిమి వైచి మునిసార్వభౌముని అహంకారం బడంచి మణిమయమైన సింహాసనంబుపై నధిష్ఠింపజేసి పసిడి పళ్ళెరమున పాదంబు లుంచి, సువర్ణ కలశంబుతో నీళ్ళిడుచు పాదంబులు గడిగి, పన్నీరు జల్లి, గంధంబు బూసి, సుగంధ పరిమళంబులు గల నాగ, పున్నాగ, చంపక, శతపత్ర మరువక, మల్లిక, పుష్పములతో పూజించి కాళ్ళు కడిగిన జలంబు తశ్శిరంబుపై నిడుకొని వేనోళ్ళ నుతించగా.

గీ. మునివరుడు నంత సుఖ శాంత మోదమునను
స్వీయకర్మకు చింతిలి మాయ నెరిగి
ఆదిమధ్యాంత రహితు డనంతుడైన
విష్ణువే ఘనుడెనయుంగ మేధికంత.

దండకము :- శ్రీ వేంకటేశాయ! లక్ష్మీపతే! నిన్ను వేడంగ నే నెంతవాడనయా! ఆదిన్ అనంతుడవై నీవు మర్రాకుపై పవ్వళించావుగా! ఓంకార మీ వయ్య సృష్టంత నీదయ్య! మీనంబువై వేదముల్ దెచ్చితీవయ్య, తాబేటిరూపాన ఆ మందరాద్రిని నీ వీపునన్ నిల్పితీవేగదా! వారాహరూపంబునన్ ధాత్రి నీ కోర మీదన్ నిలంబెట్టినావుగాదే! భక్తుండు వేడంగ నుగ్రుండవై నారసింహుండవై దైత్యునిన్ జంపి రక్తంబు ద్రావి నీ భక్తునిన్ గాచితీవేగదా దైత్యున్ బలిన్ పాతాళ లోకంబునకున్ ద్రొక్కి రాముండవై గొడ్డలిల్ బూని భూమీశులన్ జంపితే శ్రీరామ రూపంబునన్ రావణునన్ జంపి లోకంబు కల్యాణమున్ జేసితే, కృష్ణుండవై కంసునిన్ జంపితే బుద్ధుండవయ్యావు కల్క్యవతారంబు దాల్చంగ నుంకించుచున్నావు భూలోకవైకుంఠనామంబునన్ వెంకటాద్రీనినుండంగనున్నావు నిన్నెన్న నే నెంతవాడన్ దయాదృష్టి నామీద జూపయ్య ఓ అయ్యా నా తప్పు మన్నించి నన్నున్ దరిన్ జేర్చు మూర్ఖుండ అజ్ఞాన గాఢాంధకారంబు నందున్నవాడన్ దయాళుండ నీకెగ్గుజేశాను ఓ దేవదేవా! నమస్తే! నమస్తే! నమః

వ॥ అని శ్రీమన్నారాయణుని మనసారా పూజించి వేవేగ యజ్ఞశాలకు జని జరిగిన దంతయు మునివరులకు సవిస్తారంబుగ చెప్పి యిట్లనియె.

తే,గీ. లేరు నారాయణుని సరివారు లేరు
ఆది మధ్యాంత రహితు డనంత ఘనుడు
సర్వ లోకాల కాధార సార్వభౌము
డతడె కర్త యజ్ఞమునకు యనఘులార

వ॥ అని చెప్పి యజ్ఞకర్తగా విష్ణువును జేసి యజ్ఞమును పరిసమాప్తి జేసిరని శౌనకాది మహామునులకు చెప్ప సూతుని శౌనకాది మహామును లుత్తరగాథ వినిపింపమని ప్రార్థింప సతండిట్లనియె.

కం. ఈ కథ చదివిన విన్నను
జోకతో వేంకటరమణుడు సుఖముల నిచ్చున్
లోకము లేలెటి పద్మయు
ప్రాకటముగ సంపదిచ్చు పాయనిశక్తిన్.

: గద్యము :

యిది శ్రీ పరమేశ్వర కరుణా కవిత గుంజపల్లెవంశ గౌండ్ల
కుల వారాసి చంద్రుండు యీశ్వరభక్తుండు సంగీత సా
హిత్య ధురంధర్తుండు సచ్ఛీలుండు యీడిగె యంగన్న
ధర్మపత్ని మంగమ్మగార్ల ప్రథమ పుత్రుండను
పురుషోత్తమగౌడు నామధేయుండ
కె.ఆర్. మద్దులేటి కవిగారి ప్రియ
శిష్యుండనగు నా ప్రణీతంబు
నందు ప్రథమాశ్వాసము
సంపూర్ణము.
ఓం

# ద్వితీయాశ్వాసము

కం. శ్రీ కాంతామణీ ప్రియ సు
శ్లోకా కరుణావతంస సుందర రూపా
శోక నివారా శుభకర
లోకాలేలేటి ఘనుడవు లోకస్తుత్యా

వ॥ ఇట్లు సూత మహాముని ని శౌనకాది మహామునులు ఆ పైకథ చెప్పవే యని యడుగ జెప్ప దొడంగెను. మహా విష్ణువు భృగుమహర్షిని సాగనంపి తిరిగి వైకుంఠమునకు వెళ్ళగా ఆదిలక్ష్మి తోకద్రొక్కిన తాచువలె బుసలుగొట్టుచు కోపఘూర్ణిత మానసురాలై కనుల విస్ఫులింగములు రాల్చుచు కోపావేశమున నుండ శ్రీమహావిష్ణు విట్లనియె.

తే.గీ. ఎన్న దలుక జెందని లక్ష్మి మిన్నకుండె
ఖిన్న వదనయ్యె నారాక నెన్నదామె
కారణంబేమొ తెలియదు ! నికరమున
కాంత చెంత కేగెను మహాచింత గలిగి

వ॥ అలిగిన లక్ష్మిని దరిజేరి లక్ష్మి నీ కోపమునకు కారణం బేమన నామె తన మనోవ్యధ నీరీతి వివరించె

శా॥ ఏ మాత్రంబు భయంబు లేని వరపాసింప్రముడు నిర్లక్ష్యమున్
నేమో బ్రహ్మబుషంచు గర్వమున ఏ నేరంబులేక నినున్

కామాంధుండయి తన్నెనిపుడు ఖలునిన్ గర్వాంధు
దుశ్శీలుని
సామాన్యంబుగ నెంచజాల నితనిన్ సొంతంబు
శిక్షించెదన్

వ॥ అన లక్ష్మీదేవి యావేశం బెరిగి విష్ణుండిట్లనియె.

తే.గీ. పడతి బిడ్డల తప్పులు పొడియౌనె
తెలియకన్ జేసె ఆ భృగుదేవి తప్పు
దానికై నీవిక వగువంగ తగునె మగువ
తప్పు సైరింపుమో లక్ష్మి తనయు గావు.

తే.గీ. భక్తులెరుగక చిరు పొరపాట్లు సలుప
బాధ జెందంగ తగదోయి వారియెడల
తల్లి తన బిడ్డ తప్పుల దలచబోదు
దేవి దయనేలు తల్లివి నీవెగాదె

వ॥ అని విష్ణువు వేడుకొనిన కలుముల జవరాలు అలుక మానక యిట్లనియె.

తే.గీ. అతడెంతటి ఘనుడైన యగునుగాని
నాకు నిలయమై అలరారునట్టి యెదను
పాదతాడన జేసిన పాపి కీవు
దాసుడైతివి యిది నీకు ధర్మమగునె.

వ॥ మిమ్ములను పాదములతో తన్నినను కోపింపక శాంతవచనంబుల అతని పాదము లంటెదరా! యింతకన్న

నీచము కలదా. నీకు జరిగిన పరాభవము నాకును వర్తింపదా! నన్ను అవమానించినను బాధపడని నీ చెంత నిక నుండజాల నని లక్ష్మీదేవి భూలోక మెడలసాగెను.

తే.గీ. మగడు వలదంచు వేడిన మాటవినక
చెంగుచెంగున అలుకతో చిన్నెలాడి
నల్లనయ్యను కాదని వెళ్ళిపోయె
కొండకోనల గంభీరగుహల దాటి

వ॥ ఇట్లు ఆవేశపూరితయై వెడలుచున్న లక్ష్మీదేవిని విష్ణు వనేక విధముల బ్రతిమాలినను, సామ, దాన, భేదోపా యంబుల అనునయించిన బెదరక శీఘ్రగమనయై దివినుండి భువి రా యత్నించెను. పతిపై కినుక వహించి మానసికావేద నతో పల్లె పట్టణముల పర్వతారణ్య నదీనద సాగరముల నధి గమించి పుణ్యగోదావరీతీర ప్రశాంత వాతావరణమున నేకాం తముగా తపంబు జేయగా నుపక్రమించ వైకుంఠపురంబున శ్రీ మహావిష్ణువు

కం. సిరిలేనింటను నుండుట
సరికాదని దలచి నాత్మ సరసిజనాభుం
డరిగెను వియోగ భరమున
పరిగిడి వెదకంగసాగె పద్మావతికై

వ॥ ఇట్లన్ని లోకంబు లన్వేషించి తుదకు

ఉ॥ కొండలు గుట్టలున్ వెదకి కోమలి గానక శోకతప్తుడై
ఎండల గాలి వానల మహీధర దుర్గమ మార్గమందునన్
మండెడుపొట్టబట్టుకొని మౌనముఖంబున నశ్రుధారలున్
కుండల జాలువార నిజకోమలికై విలపించె జిష్ణుడున్

వ॥ ఇట్లు భార్యను వెదకుచు యెందునుగానక పలవరించసాగె.

సీ॥ పలుమారు నీ హస్త పల్లవంబుల చేత
అలివేణి నా తాప మార్పవేమి
చంద్రకాంతినిబోలు చంద్రబింబమునయ్యో
నీ ముఖకాంతితో నెమ్మి బడును
భామ నా విరహ మార్పంగను ప్రేమతో
తనువు నా తనువున బెనచవేల
హంసగమన నీదు హంసనడకచేత
ఆహ్లాద మొందించు ఆదిలక్ష్మి

తే.గీ. మగువ ననుపీడి నీ కెట్లు మనలనయ్యో
శోకవార్ధిని ముంచితే సుందరీవు
అంచు పలుమారు తలపోసి కించపడును
లక్ష్మి మగనికి ప్రియసతి పిచ్చిగలిగె.

వ॥ అప్పుడు పిచ్చివానివలె శ్రీ మహావిష్ణుండు

సీ॥ ఏ జంతు పొడగన్న యెలనాగగానరే
అని పెక్కుఖంకుల నడిగియడిగి
యే పిట్ట బుఱ్రకన నా పత్ని జూచితే
అని పెక్కుఖంగుల నడిగియడిగి
యే చెట్టు కనుగొన్న నా చెలిన్ జూచితే
అని పెక్కుఖంగుల నడిగి యడిగి
యే గుట్ట కనుపింప నిభయాన జూచితే
అని పెక్కుఖంగుల నడిగి యడిగి

ఆ. సొలసిన హృదయాన శోకవార్ధిని మున్గు
కలత నంది భీతి పలవరించు
ఆదిలక్ష్మి గాన కడవుల గాలించె
విరహతాపవహ్ని వేడిచేత

వ॥ శ్రీ మహావిష్ణు వీ కతనంబున దిశదిశల గాలించుచు లక్ష్మినామస్మరణంబు జేయుచు ననేకాహోరాత్రంబులు గడిపి విఫలయత్నుండై విసిగి వేసారి చివరకు పుణ్యప్రదేశంబగు శేషాద్రి జేరి విశ్రమించె.

తే.గీ. అనఘ విష్ణుండు వృషభాద్రి యందు మఱ్రి
చెట్టునీడ వల్మీకము జేరి విశ్ర
మించుట కనువైన స్థలము నెంచి ప్రీతి
పుట్టుటే లేని దైవంబు పుట్టనుండె

వ॥ ఇట్లు పుట్టలో విశ్రాంతిగ శ్రీహరి యుండగ

తే.గీ. బ్రహ్మమానసపుత్రుఁడు పద్మనయను
గనక కానలన్నిట తిర్గి గాసి జెంది
వేంకటాద్రి జేరి వెదికె వెఱ్ఱివాని
పగిది పుట్టనున్న హరిని భ్రాంతి గనియె.

వ॥ నారదుండు దేవదేవుఁడైన శ్రీమన్నారాయణుని గాంచి విషాదవదనుండై నమస్కరించి యిట్లనియె. స్వామీ! నీ కెంతటి దురవస్థ వాటిల్లినది. తానొకటి జేయంబూన దైవ మొకటి దలంచు నన్న నానుడి సార్థకంబయ్యె. నీవు జగన్నాటక సూత్రధారివి. నీ లీలావిలాసంబు లెరుగ నేనెంతవాఁడను. ప్రభూ నిత్యంబు నీ సేవాభాగ్యము ప్రసాదింప గోరుదునని, స్వామి ఆశీర్వాదములంది పునః ప్రణామంబు లాచరించి నారదుండు నారాయణ నామసంకీర్తన మాలపించుచు నేరుగా కైలాసముం జేరి పశుపతికి జరిగిన వృత్తాంత మెల్ల పొల్లుపోక తెలియజేయ, నుభయులు బ్రహ్మ కడ కేగిరి. మువ్వు రీ విషయము సుదీర్ఘముగా నాలోచించి చివర కంద రొకటిగా కొల్లాపుర పరిసరప్రాంతమున తపస్సు జేయుచున్న లక్ష్మి చెంతకు వెళ్ళి ప్రణామంబు లాచరించగా లక్ష్మీదేవి యాగంతకుల గని వారి కుచితోపచారములు జేసి మీ రాకకు కతనం బెరిగింపు మనగా బ్రహ్మ మహేశ్వరు లిట్లు నుడివిరి.

సీ. అమ్మరో నీజాడ యా విష్ణుదేవుండు
కానలెల్ల వెదికె కానలేక
శోకవార్ధిని మున్గి శోషిల్లుచున్నాఁడు
వేంకటాద్రిని జేరి వెఱ్ఱియయ్యె

ద్వితీయాశ్వాసము

మఱ్ఱిచెట్టుక్రింద మంథుని కైవడి
పుట్టనుండెను భవమోహమీడి
అన్నపానాదుల కలమటించుచునుండె
కనికరించవె తల్లి కడలితనయా

తే.గీ. ఆవుదూడల మయ్యెదమమ్మ మేము
గొల్లభామవై మమ్ము గైకొంచు నేగి
చోళరాజున కమ్ముడీ! సొమ్ము కీవు
అమ్మ దయనేలు మమ్ము సమాదరమున

వ॥ బ్రహ్మ మహేశ్వరుల నభ్యర్థన లామోదించి మహాలక్ష్మి నూతనోత్సాహ ప్రసన్నచిత్తయై.

సీ. పవడంచు చీరెను పటిమతో గట్టియు
పేటంచు రవికె సంప్రీతి దొడిగి
ముక్కుకు ముక్కెర ముదమార నలరించి
కురులు చక్కగ దిద్ది కుంకుమిడియు
సుదతి సూడియములు సొంపుగా ధరియించి
కనులకు సొగసుగా కాటుకిడియు
చెలువ జానతనముఁ జొన్నప్ప నడకల
కొత్తకాంతులు వెల్గె కోమలాంగి

తే గీ. గొల్లవేషము బూనియు యుల్లమలర
యావుదూడల గొంపోయి ఆదిలక్ష్మి
చోళరాజున కమ్మెను బేళసపుడు
చంద్రగిరి జేరె సరగున నింద్రవదన

వ॥ అప్పు డా ధరాధిపుడు యావుదూడల కొని ధన మిచ్చి గొల్ల భామకు వీడ్కోలు సలిపిన పిమ్మట విశ్రాంతంబుగా

తే గీ· ఆవుదూడల నరయ నా యవని విభుడు
వాని తన మందలో నుంచ వాంఛ గలిగి
గొల్లవారిని పిలిపించి యుల్లమలర
జెప్పె వారికి యిట్లును ఒప్పుగాను·

తే·గీ. క్రొత్తగోవుల మన మంద గూర్చి వాని
శ్రద్ధ పోషించి మీ నేర్పు జూటుమంచు
ఆవులన్ గోపబాలల కప్పజెప్పి
నాజ్ఞ యిచ్చెను మహోద్ధృతి నందరకును

వ॥ రాజాజ్ఞ మేర కాలకాపరులు యా గోమాతను వాని పోషణలో కడు శ్రద్ధ వహించి ప్రతిరోజు వానినన్నిటిని తెచ్చి కడుపార పచ్చిగడ్డి మేపుచుండిరి. యీ విధముగా వృషభాద్రిని గడ్డిమేయుచుండ ఒకరోజు

ఉ॥ ఆవులమంద లోపలను ఆవును దూడయు వేంకటాద్రిపై
గోవులమందనున్ విడచి గోప్యముగా నట పుట్ట
చెంతకున్
గోవును వెళ్ళి పాల్ పితికె కూరిమితోడుత త్రాగె
నప్పుడున్
లావు మొకింత లేకయును రాణిని వీడియు
పద్మనాభుడున్.

వ॥ ఇట్లాలకాపరి గుప్తచారుని పగిది గోవు నొక కంట కనిపెట్ట నారంభించగా నొకనా డొక వింత సంఘటనను గాంచెను.

ఉ. ఆవుల వీడి దూరముగ నా మధుసూదను గోవుజేరి స
ద్భావన క్షీరమీయ భగవానుడు తృప్తిని గ్రోలుచుండెగా
లావు యొకింత లేక తనలక్ష్మిని వీడ మహావిపత్తు సం
సేవితమయ్యె నయ్యలకు జేసిన కర్మఫలంబు దప్పునే!

వ॥ గోవు పుట్టచెంతకు పోయి కన్నములో పాలిడు చుండ గోరక్షకుం డది గాంచి యాక్రోశంబున

శా. కోపావేశ విమూఢ చిత్తవశుడై కొండంత క్రోధంబుతో
పాపాత్ముండగు నా దురాత్ముం డపుడున్ పాపంబిదం చెంచకన్
గోపాలుండు గొడ్డలిన్ విసరగన్ గోమాతకున్ దాకునన్నా
కాపాడంగను పుట్టనుండి వెడలెన్ యా విష్ణుడున్ జిష్ణుడున్

వ॥ గోవిందుడు గోరక్షణార్థమై పుట్టనుండి వెలువడు సందర్భమున ఆలకాపరి కరకు గొడ్డలి విష్ణు శిరంబు దాక స్రవించుచున్న రక్తప్రవాహము గాంచి ఆలకాపరి మూర్ఛిల్లె.

సీ॥ గొడ్డలి తాకంగ గొబ్బున రుధిరంబు
శిఖరంబుపై చిమ్మి చెలగుచుండ
శిఖరాగ్రములనుండి శిలలపై దిగజారి
గోమాతపై పడి గోటు మొప్ప

గోవు తనువునుండి గోవిందు నిలయంబు
పుట్టపై బడ కాంతి ప్రోదినంద
ఆదిత్యు నిగ్రహ మాగ్రహంబుగ మారి
వెయ్యి కిరణంబుల వేడిజూప

తే.గీ. రక్తసిక్త ప్రపూర్ణ ధరాతలంబు
తీర్చిదిద్దిన చిత్రమై తేజరిల్ల
కనుల మిరుమిట్లు గొలిపెడి కాంతి ఒప్ప
నడవి నూతనాకృతి శోభ నావరించె.

వ॥ ఈ భీభత్స సంఘటనానంతరము గోవు తన మీద పడిన నెత్తురు మరకలతో శీఘ్రగతిని పురము జేరి అంబా, అంబా యని యరచుచుండెను. అప్పుడు రాజు నెత్తురు మరకలతో నున్న ఆవును జూచ దిగ్భ్రమ జెంది ఈ దుస్సంఘటనకు కారణ మేమై యుండునని, సత్వరము నివేదింపుమని భటుల నాజ్ఞాపించెను.

తే.గీ. సేవకులు వేగ కొండపై చేరిచూడ
మూర్ఛతో డుత బడియున్న మురళీధరుని
పద్మనయనునితో పాటు ప్రక్కనున్న
అలకాపరి గాంచిరి జాలిమెరయ.

వ॥ మూర్ఛావస్థలో యున్నవారి జూచి భయభ్రాంతులతో పురము వచ్చి చూచినదంతయు రాజునకు జెప్ప, దత డాశ్చర్యచకితుడై తానే స్వయముగా కారణం బరయ నడవికి

జేరి .యా దృశ్యము తిలకించుచుండ మహారాజుతో శ్రీనివాసుం డిట్లనియె.

తే.గీ. భూవర విను గొడ్డలితో కావరమున
దోష మెరుగని ననుగొట్టె ధూర్తభటుడు
ప్రజల పాపంబు రాజును పట్టివేయు
శాప మిడువాడ నింక పిశాచి కమ్ము

వ॥ అనిశాపంబిచ్చిన రాజు గడగడ వడంకుచు స్వామి పాదంబులపై బడి తమది తప్పు కాదనియు శాపవిముక్తి కలుగ జేయుమనియు అనేకవిధముల ప్రార్థించిన యా విరాట్స్వరూపుండు దయగలిగి యిట్లనియె.

సీ. ధరణీశ శాపంబు తరుగ దెల్పెద విను
భావిజన్మాన రాజ్యభాగ్యమంది
చోళవంశంబున శూరుడీవయ్యు నా
కాశ రాజనగను ఖ్యాతిగనుము
జన్మసార్థకముగ సద్గుణుల్ మెచ్చంగ
రాజ్యంబు పాలించి పూజ్యుడగుము
పసిడిబొమ్మను బోలు పద్మావతిని గని
ముద్దుముచ్చట దీర మోదమలర

తే॥గీ॥ ధన కనక వస్తువాహన ధాన్యరాశి
మణిమయాసన మకుట భూషణములాది
కట్న కానుకలు నీ ప్రియ కన్య సీయ
పుణ్య ఫలమబ్బ శాప విమోచనగును

వ॥ నీవు నా కిచ్చు కిరీటంబునే ప్రతి శుక్రవారము ధరింప నీకు శాపవిమోచనము కలుగును. యనిచెప్పి రాజును పంపివైచెను. తదనంతరంబు స్వామిని కొట్టిన కారణమున అంధుడై మూర్ఛపడియున్న సేవకుడు లేచి కనులు కనుపించక స్వామి ననేక విధముల కొనియాడగా నతనితో స్వామి యిట్లనియె.

ఉ॥ వేడిన వారినెల్ల కడు పేదమి గావ మదీయ నీతి నీ
గోడు నొకింత మానుమిక గోపులకాపరి ! వేంకటేశునై
వేడుక కొండ నిల్చెదను వేలకు వేల జనంబు భక్తితో
మాడలనిచ్చి కొల్చెదరు మంగళమెంచి నిరంతరంబుగన్

వ॥ కాన నీవు నా భక్తుల వెంబడి వచ్చి నన్ను మనసార సేవించిన నీకు పునః నేత్రప్రదానంబగును. తదనంతరంబు శ్రీనివాసుడు గాయమువలన

ఆ.వె. వేంకటేశ్వరుండు సంకటముల జిక్కి
కొండ దిరుగసాగె నండదప్పి
దేవగురువు హరిని తృప్తి సందర్శించి
వందనంబుల జేసె డెందమలర.

వ॥ దేవగురువు నారాయణుని దర్శనంబున కన్నుల నానందాశ్రుకణములు నొలుక మంద స్వరంబుతో - వైకుంఠవాసా! సర్వాంతర్యామివైన నీ వీ నిడుములకు లోనై సంచరించుచుంటివని యడుగ భగవానుం డిట్లనియె – కర్మబంధము దప్పింప నెవరితరము. నేను భక్తుల దాసుండను. వారి కొరకు

యిట్లు జేయవలసి వచ్చినది తనను లక్ష్మి విడనాడిన సంగతి నాదిగా యుదంతం బెరింగించి తన గాయమునకు మందు తెల్పుమని కోరగ, మహర్షి మేడిపాలు కొట్టుమని చెప్పి నారాయణ స్మరణ సలుపుచు వెడలిపోవ నప్పుడు శ్రీ మహావిష్ణువు.

ఆ॥ మేడిచెట్టు కొరకు మేదినీతలమును
వెదుకసాగె నెట్టి విసుగులేక
కనుల కానరాదు కానలందును మేడి
కాలమహిమ నెవరు గాంచగలరు?

వ॥ ఇట్లు సర్వేశ్వరుండు అడవిలో దిరుగుచుండ.

ఉ. ముందొక పర్ణశాల గని మోదముతో దరిజేరి భక్తితో
వందన మాచరించి భగవాను డయోమయ రూపురేఖలన్
మందుని భంగి నిల్వగను మౌనివరాహుడు
ప్రశ్నవేయగన్
ఇందిరవల్లభా! జరిగె నేమి విచిత్రము దెల్పగోరుదున్.

సీ. అనఘ చెప్పెద వినుమా లక్ష్మి కలహించి
నను వీడిపోయెనూ ననువుజూచి
యెంత వేడినగాని పంతంబు మానక
బెట్టిబిట్టారుచు వెడలిపోయె
క్రోధాగ్ని చెలరేగి కుములుచు నిలువీడి
యెచ్చోటు కేగనో యెరుగజాల
ఎక్కడ గనరాదు నిక్కంబు గనలేక
బిక్కముఖంబున పొక్కుచుంటి.

ఆ.వె. వందనంబు జేతు వరహావతారుడా!
నన్ను కరుణజూడు సన్నుతాంగ
ఆలువీడి పోగ నంధజీవితమాయె
యిప్పు కొంత చోటు యిక్కడుందు

వ॥ అని శ్రీనివాసుండు నడగ వరాహుండిట్లనియె.

తే.గీ. సరిసరి యిదు యెట్లు పొసగు స్వామి నాకు
నెంత ధనమిత్తు విప్పుడు నెరుగ దెల్పు
మూరకే ధర నీ వెట్లు కోరవగును
పారితోషిక మిచ్చుట పాడియౌను.

వ॥ ఆదివరాహస్వామి యభీష్ట మెరింగి శ్రీహరి-స్వామి ప్రస్తుతము నన్ను లక్ష్మి నెడబాసియున్నందున చేత చిల్లిగవ్వ యైనను లేదు. దయాసాగరుడవు నన్ననుగ్రహింపుమని వేడగా వరాహుం డందుల కంగీకరించి.

తే.గీ. ఇచ్చె నూరడుగుల ధర లచ్చిమొగని
కిచ్చుతోడ వరాహుండు నొచ్చుకొనక
సర్వ మిచ్చెదు వాడె చే జాచవలసె
భార్య నీడంగ భాగ్యంబు భంగపడదె!

ఆ. ఉండ నీడ నిచ్చె నుత్కృష్ట
దండిమగడు పరమ ధార్మికుండు
కొండ కొచ్చువారు కొల్తురు మనలను
ప్రథమ పూజ నీకు పట్టుబడును

వ॥ శ్రీహరి పల్కులకు వరాహస్వామి పరమానంద మంది భక్తురాలయిన వకుళాదేవిని తనవెంట నిడుకొని రాగా శ్రీహరి వరాహస్వామి జూపిన స్థలములో పర్ణశాల నిర్మింప నుద్యుక్తుడాయెను.

ఆ॥ పర్ణశాల యొకటి పరమేష్టి కట్టెను
చూడనింపుగలుగు సొంపు లీను
అంచు వుండి రపుడు ఆ దేవదేవుండు
పర్ణశాల వారి వాసమయ్యె.

వ॥ ఇట్లుండ ఒకనాడు వకుళాదేవి యిట్లనియె.

ఉ॥ ఎవ్వరివయ్య నీ పితుల నెందుకు కానల సంచరించెదో
యెవ్వరుతేని వానివలె నిక్కడనుండగ చోద్యమయ్యెనో
యివ్వనమందు బాధల సయించుచు నుండుట నేమి కారణం
బవ్వల తల్లిదండ్రులు సుతు లాలు నెరుంగక నొంటి గుంటి రే

వ॥ వకుళాదేవి అమాయకముగా నడిగిన ప్రశ్నకు శ్రీని వాసుండిట్లనియె.

సీ. ఏమమ్మా నను నీవు ఎవరని యడిగితే
ఆద్యంత రహితుండ నన్ని నేనె
నిలయమొక్కటి లేదు నిత్యంబు భక్తుల
హృదయసీమల యందు మెదలుచుందు

పడిపడి గనగోర నను నెల్ల వేళల
ధ్యానించువారికి దాను డేను
అమ్మనాన్నలు మిత్రులాప్తు లెవరులేరు
గొంటివాడను జుట్టు మొకరు లేరు

తే గీ. నేను లేనిది శూన్యంబు నేలమీద
నణువణువునను నిరతంబు దాగియుందు
తొల్లిగల సిరి నిర్దయ తొలగిపోయె
ధర్మ సంస్థాపనార్థమై తరలినాడ.

వ॥ బాలరూప నారాయణు నమృతవాక్కులు నాలకించి వకుళాదేవి విస్మయగ్రస్తురాలై తుదకు పసివాని పలుకుల నాలింపదగదని భావించెను. స్త్రీ సహజముగా మాతృత్వ పిపాసి. వంధ్యజీవితము మహా దుర్భరము. "అపుత్రస్య గతి ర్నాస్తి" యనిగదా వేదోక్తి. బిడ్డలులేని తానా ముద్దులొలుకు బాలుని తన పుత్రునిగా పెంచుకొనదలచెను.

కం. బిడ్డల కొరకై వగచితి
దొడ్డయు-లభియించి తీవు దుఃఖము బాసెన్
బిడ్డా నిను పెంచుదు నే
నడ్డంకుల నొడ్డుకుందు నతిశయ తృప్తిన్.

కం. ముల్లోకనాథు సేవల
చల్లని హృదయాన ప్రీతి సకలము తానై
తల్లిగ హరి పెంచె వకుళ
దొల్లిటి తన నోము ఫలము తోడై రాగన్

వ॥ శ్రీనివాసుని, నాయనా! నీలో లక్ష్మీకళలు తాం మాడుచున్నవి కావున శ్రీనివాసుడవని పిలుచుకొందు నామకరణము చేసెను.

ఉ. కమ్మగ శ్రీనివాసు తన కౌగిట జేర్చి మహాదరంబుగ
లెమ్మని బుగ్గలన్నిమిరి లేనగ వొప్పగ బుజ్జగించి చే
కొమ్మని పండ్లనీయ హరికూరిమి వానిని మెక్కుచుం
యమ్మమనంబు స్వర్గ సుఖమందుచు సర్వము
విస్మరించె

వ॥ ఇట్లు నిత్యము తల్లిచే పాలు, పండ్లు, జుంటుతె యలు, దుంపలు దినుచు దినదిన ప్రవర్ధమానుండై తల్లి సరణ్యంబున సుఖంబుగా కాలంబు గడుపుచుండె.

కం. కరుణాలవాల యినకులా
భరణా రాక్షస కులాంత భంజన రమణా
మురళీగాన విలోలా
తిరుమల నివాస ముకుంద దీనశరణ్యా.

: గద్యము :

యిది శ్రీ పరమేశ్వర కరుణా కవిత గుంజపల్లెవంశ గౌండ్ల
కుల వారాసి చంద్రుండు యీశ్వరభక్తుండు సంగీత సా
హిత్య ధురంధరుండు సచ్చీలుండు యీడిగె యంగన్న
ధర్మపత్ని మంగమ్మగార్ల ప్రథమ పుత్రుండను
పురుషోత్తమగౌడు నామధేయుండ
కె.ఆర్. మధుశేటి కవిగారి ప్రియ
శిష్యుండనగు నా ప్రణీతంబు
నందు ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

ఓం

# తృతీయాశ్వాసము

కం. జలరాశి కన్య రమణా
జలజాసన వినుత ధామ జగదభిరామా!
జలరాసి భవ్య మందిర
జలజాక్ష భవవిదూర జానకిరామా!

వ॥ ఇట్లు సూతమహామునితో శౌనకాది మహామును
యిట్లనిరి.

ఆ. వినగ వినగ మాకు ఎంతగా దోచెను
సొంపుమీర చెవుల కింపుగాను
తనివి తీరకుండె తారకప్రభవ గాథ
చెరకుతీపి కన్న శ్రేష్ఠమయ్యె

వ॥ శౌనకాది మునుల యభ్యర్థన మాలకించి సూతు
డిట్లు జెప్పదొడంగె

సీ॥ చెప్పెద మును నాకు శ్రీనివాసు చరిత
నారదుండు దెలిపె సారగాథ
చెప్పిన దంతయు దప్పక నుడివెద
శ్రద్ధతో వినరయ్య బుద్ధిగాను
శేషాద్రి కవ్వాల శృంగార సీమలో
రామాపురాధీశు రాజధాని
రాజు సుధర్ముడు రాణిమెప్పవెలసె
రాజ్యమేలెను లోకరంజకముగ

తే.గీ. అతని కిద్దరు సప్తర్మ సుతులు యశులు
జ్యేష్ఠుడాకాశ రాజు విశిష్టమతుడు
తొండమానుడన మిత సంతోషరాశి
అన్న కనుగుణంబుగ నిత్యమండనుండె.

వ॥ ఇట్లు సెప్టిసమారు డాకాశరాజునకు పట్టముగట్టి కుమారులకు రాజకీయములు, పరిపాలనా దక్షత, న్యాయా న్యాయ వివక్షతాది శాస్త్రంబులు, రాజులకు కావలసిన ధర్మము లన్నియు బోధించెను. సకలజన్మంబులందు మానవజన్మము దుర్లభంబు, అంధకారబంధురమయిన సంసారమనెడి సాగ రంబు దాటలేక దారితెన్నుగానక నిరర్థకంబయిన ఈ తనువు శాశ్వతంబని నమ్మి కామ, క్రోధ, లోభ, మద మత్సరంబుల జిక్కి, మాయాభరిత మధురభ్రమయామయమైన తృష్ణకు లోనగుచు రహస్యసంభోగచాతుర్యంబున కళత్రంబుల విడువ లేక వృథాప్రాయనంబున నాయువు వ్యర్థంబు జేయుచున్నా నని సర్వభూతాంతర్యామియైన సర్వేశ్వరుని జేర తలంపున సర్వసంగపరిత్యాగంబు జేసి మోక్షాసక్తితో తపంబుచేయ సం కల్పించెను.

ఉ. కాయము అస్థిరత్వమని కానల నిర్మల మౌనివృత్తితో
కాయల నాకులన్ దినుచు గౌతుక బుద్ధిని మోక్షమార్గ
మున్
డాయగ లోకసంపదల డంబము మాని నిరంతరంబుగా
బాయని భక్తిగొల్చె నెప పద్మదళాక్షుని పాదపద్మముల్

వ॥ ఇట్లు సద్ధర్ముండు అరణ్యంబునకేగి తపంబు చేయు చుండె. పురంబున జ్యేష్ఠ పుత్రు డాకాశరాజు ధర్మదీక్షాపరుడై రాజ్యంబు పాలించుచుండె.

ఉ. ధర్మము నాల్గుపాదముల ధార్మిక బుద్ధిని రాజ్య
మేలుచున్
నిర్మలచిత్త మీశుని పునీత మనంబున సన్నుతించి స
త్కర్మము విప్రవర్యులకు కాన్కలొసంగి సుపుత్రలబ్ధికై
కూర్మిని మార్గమున్ దెలియగోరెను రాజు మహా
విస్రమ్ముడై

వ॥ ఇట్లు రాజు చింతాక్రాంతుడై యుండ ధరణీదేవి యిట్లనియె.

సీ. తిరిగితి మెన్నియో తీర్థరాజంబుల
మునిగితి మెన్నియో పుణ్యనదుల
మ్రొక్కితి మనసార ముక్కోటిదైవాల
నిచ్చదీరగ దానమిచ్చినాను
సాదుజనంబుల సమ్మతి గొల్చితి
సద్బ్రాహ్మణుల సేవ సలిపినాను
పుట్టల మ్రొక్కితి గుట్టల మ్రొక్కితి
చెట్లకు మ్రొక్కితి చెలిమితోడ

గీ. వందలాదిగ సల్పిన వ్రతఫలంబు
శోక మొనగూర్చె చిత్తంబు శూన్యమయ్యె
పూర్వకర్మల దొలగింప పుత్రుబడయ
భాగ్యమబ్బునో లేదో యా బ్రహ్మ కెరుక

వ॥ ఇట్లు నిరాశ నిస్పృహలతో రాజదంపతులు సతమత మవుచున్న మానసికావేదనను గమనించి మంత్రివరుం డిట్లనియె. మీరీ విధంబున చింతించవలదు. మన కులగురువును రప్పించి మార్గమన్వేషింతుమని కర్తవ్య ప్రబోధమును జేయసాగె.

కం. చింతల జెందకు కులగురు
చెంతన్ ప్రార్థింప నీకు సిద్ధి లభించున్
చింతన్ దీర్ప సమర్థులు
శాంతిని కలిగించు ఫలము సత్వరమబ్బున్

వ॥ అమాత్యుని సలహామేరకు గులగురువు నాహ్వానింపగా.

కం. తప్పిదముల బాప గురువు
చప్పున జనుదెంచె నటకు సౌజన్యమతిన్
వొప్పిదమగు దేవర పని
మెప్పుగ జేయుంగదలిచె మేలొనరింపన్

కం. వచ్చిన ముని వరు సేవల
మచ్చికతో రాజురాణి మంత్రిహితైషుల్
యిచ్చ దలిర్పగ సల్పిరి
అచ్చపు వైవోపచార మతులిత భక్తిన్.

వ॥ ఆగంతుక కులగురువయిన శుకమహర్షిని సంతృప్తి పరచి భక్తితో యిట్లనిరి.

కం. బిడ్డల కోర్కెల దీర్చెడు
దొడ్డవు మా వేల్పు నీవె దుర్భరమగు నీ
గడ్డు సమస్య నెదుర్కొని
బిడ్డల గను మార్గమేదొ వివరింపగదే!

వ॥ కాన మాకు సంతానప్రాప్తియున్నదో లేదో తెల్పు మన శుకమహర్షి యిట్లనియె. ఓ రాజా! నీకు సంతానప్రాప్తి కలదు. పూర్వము దశరథమహారాజు సంతానమునకై పుత్రకామేష్టి యజ్ఞము గావించి వ్రతప్రాప్తి పొందెె. జనక మహారాజు యజ్ఞము గావింప నుంకించగానె అతనికి ఆదిలక్ష్మియే పుత్రికగా లభించె. మీరట్టి యజ్ఞమును గావించిన సంతానవంతు లగుదురని చెప్పగా రాజదంపతులు సంతుష్టాంతరంగులైరి. రాజు సంతోషంబుతో పుత్రకామేష్టి యజ్ఞము జేయ సంకల్పించెను.

కం. బంగారపు నాగలి గొని
సింగారము జేయ భక్తి శ్రీసతిపతులున్
జంగాలను వెంట నిడుకొని
గంగాధరు భంగి శుకుడు గదిలెను ప్రీతిన్

వ. శ్రీ కార్యార్థ మెల్లరు యజ్ఞప్రదేశంబునకు జని, ధూప దీప నైవేద్యంబులతో విప్రులు పూజించుచుండః మంగళ వాయిద్యంబులు మారుమ్రోగుచుండ, హోమాగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుచుండ వేదజ్ఞుల మంత్ర ఘోష ప్రతిధ్వనించుచుండ శుకమహర్షి నాగలికి యెద్దులను పూన్చి యజ్ఞప్రదేశంబును దున్నుమని రాజు నాజ్ఞాపించెను.

తే.గీ. మక్కు దున్నంగ దున్నంగ మక్కులోన
హలము కొనకొక్కు మంజూష నలర గాంచి
రాజు మానసానంద విరాజితమున
మట్టి దొలగించి పెట్టె జేపట్టె ప్రీతి.

వ॥ అప్పుడు శుకమహర్షి ధరణిదేవతలు మంత్రాక్షతలు జల్లుచుండ మంగళవాద్యంబులు మ్రోగుచుండ రాజు సమక్షంబున పుడమి పట్టిగల మంజూషను శుకమహర్షి తెరువ.

కం. బంగారు పెట్టె యందున
రంగారగ పద్మమందు రాజీవాక్షి !
శృంగార మొప్ప వెలసెను
బంగారపు ముద్దుబొమ్మ బాలామణిగన్

కం. పాడిరి గంధర్వు లప్పుడు
ఆడిరి రంభాది కాంత లతులిత రక్తిన్
గూడిరి దేవగణంబులు
వేడుక గురిపించినారె విరివర్షంబున్

వ॥ ఇష్టార్థంబుగా

ఉ. తామరపుష్పమందు వసుధాసుత హాయిగ పవ్వళింపగా
కోమల దేహకాంతి చిరుకోరిక చారువిలాసహాసముల్
ఏమని తెల్పు దానలువ నేర్పు మహావిభవంబు జాటు నా
కామిత పుణ్యరాశి వరకాంచన శిల్పము తీర్చిదిద్దెగా!

వ॥ ముద్దులొలుకు శిశువును జూచి ధరణీదేవికి.

కం. పంకజముఖి కపు డుబ్బెన్
హొంకంబుగ పాలు చనులు పొంగులువారన్
శంకించక రాణి శిశువు
శంకర కాన్కంచు మదిని సంతసమందెన్.

వ॥ ధరణీదేవికి మాతృత్వము పెల్లుబికెను. బిడ్డ నా దంపతులిద్దరు ముద్దాడు సమయంబున ఆకాశవాణి ఇట్లనియె: రాజా! నీ జన్మ ధన్యమయినది. నీకు లభించిన బిడ్డ సాక్షాత్తు లక్ష్మీ సమానురాలు. ఈమెను నీబిడ్డగా పెంచుకొనవలయును భగవంతుడు ప్రసాదించిన బిడ్డయని ఆకాశవాణి నుడువ ఆ మాటలు విన్న ఆకాశరాజు పరమానందభరితుండై జాతకర్మంబులు జేయించెను. పద్మమునందు లభించినదిగాన "పద్మావతి" యని నామకరణము గావించి అల్లారుముద్దుగా పెంచుచుండిరి.

కం. ఆ చెలువ సందచందము
లే చెలులం గానరాదు హితవచనములన్
దా చెలియ పలుకు తీరులు
రా చిలుకలకైన నుడువరాదాయె గదే!

వ॥ ఇట్లు పద్మావతి దినదిన ప్రవర్ధమానయై కోటిసూర్య ప్రకాశమానయై చూపరులకు మన్మథ వికారము కల్గించునట్టి రూపలావణ్యముతో లే ప్రాయంబున తన చెలికత్తెలతో నిత్యముత్సాహమున క్రీడించుచుండె.

సీ. పద్మావతిని గూడు పడతులందరికెల్ల
పరమాత్మ కథలను పాడిచెప్పు
భామలందరి గూర్చి పటిమతో బొమ్మల
పెండ్లి కార్యంబుల ప్రీతి జూపు
పడుచువారము మేము వర కళ్యాణమ్ములన్
వెయ్యివెట్లని వాని నియ్యకొల్పు
పెండ్లిభోజనముల ప్రియమార బెట్టంగ
పలురకంబుల వంట వండుడనును.

తే.గీ. బాల్యకాలమునుండి సుభాషణముల
చెలులతోగూడి తానెన్నొ చిలిపిపనుల
జేయుచుండెను పద్మాక్షి చిన్ననాడు
జాణగా చెలువొందె సుచారుశీల.

వ॥ క్రమక్రమంబున పద్మావతికి పెండ్లియీడును రాగా ధరణీదేవి పద్మావతికి శీఘ్రముగా వివాహము జరుపుదమని భర్తతో సమాలోచన జరుపగా, ఆకాశరాజు వరాన్వేషణలో యుండ త్రిలోకసంచారి నారదు డరుదెంచె. మహర్షి రాకకు రాజు సంతసించి అర్ఘ్యపాద్యాదులతో వారిని పూజించి పద్మావతిని రావించి, సాష్టాంగ దండప్రణామంబులుఁ జేయించగా నారదుండు సంతుష్టాంతరంగుడై పద్మావతి హస్తరేఖల పరిశీలించి సంభ్రమాశ్చర్యములతో నిట్లనియె.

మ॥ సరిలేరీమెకు దేహ, రూప, గుణ భాషా భూష
లందెవ్వరున్
చరితార్థంబగు శక్తిగల్గినది యీ సర్వేశ్వరీ శాంభవీ
కరుణాలంకృత లక్ష్మియే తనయ స్త్రీ కామె మహావిష్ణువే
కరుణాసాగరు డల్లు డామెగద నో ఙ్మానాథ నీ
భాగ్యమున్

వ॥ అని మరియు నిట్లనియె.

కం. నీ కులమున్ నీ పేరును
నీ కీర్తియు నీ ఘనతయు నీ రాజ్యంబున్
నాకేశుని కయినలేదు
లోకాలేలెటి ప్రభువులు లోకులు బొగడున్

వ॥ అని దారదుండు జెప్పి వెడలిపోయెను. ఈ కథ యిట్లుండగా అక్కడ వకుళాదేవి పెంచుతున్న మహావిష్ణువు నకు వేటాడు కుతూహలంబున తల్లి కడ కేగి తన యభీష్ట మెరింగించెను. వకుళాదేవికి సంభ్రమాశ్చర్యములలోపాటు భయ మావహించి యిట్లనియె నాయనా! అడవులయందు సంచరించు క్రూరమృగములను వేటాడుట సులభము కాదు, ప్రాణాపాయముగూడ సంభవించును. కాన వన విహారమున కేగుము. కాని వేటాడుట వలదని కుమారుని ప్రయత్నము మరల్పంగా ప్రయత్నించెను. కాని శ్రీనివాసుడు తల్లికి నచ్చం జెప్పి ధనుర్బాణములు ధరియించి బయలుదేరెను. వనాంత రంబును గాలించుచు భయంకర గండ, గజ, గవయ. గండభే

రుండ, ఖడ్గ, శరభ, శార్దూలంబులపై నిశితబాణంబులు వేయ నా క్రూరమృగంబులు విలవిలలాడి ప్రాణంబులు విడనాడ చమర, శల్య, సారంగ, సాలవృక, వరాహ, మహిష, మర్కట, మహూర, మార్జాలాది మృగంబులపై మృగరాజపరాక్రమంబున ఘోషింపించి వేటాడ నా ఖడ్గ ఘాతమునకు వక్షముల్ పగిలి రక్తంబు కాల్వలై పారుచుండ కాళ్ళుతెగి కంఠంబులు సగము తెగి ప్రాణములు పోక విలవిల తన్నుకొనుచు నిమీలితనేత్రలై చిట్టచివరకు ప్రాణంబులు వీడు జంతుజాలములును వేట తమకంబున మృగంబుల వెంటబడి యెగురుచున్ చరించుటన్ జేసి బుభుక్షా పిపాసుల వలన మిగుల పరిశ్రాంతుండై శ్రీనివాసుడు చల్లని నీటి కొలంకుం గానక వికలమానసుండై.

కం. చంపితి ఖడ్గ మృగంబుల
జంపితి గండ గవయ గజ శార్దూలములన్
జంపితి సింహము లన్నియు
జంపితి వనమున తిరిగెటి జంతు చయంబున్.

వ॥ అప్పుడు మదించిన ఐరావతంబో యన ఘీంకరించుచు ఒక మత్తేభమచ్చట గల వృక్షరాజముల నెల్ల పెకలించి నడవని ధ్వంసంబు జేయుచు శ్రీనివాసుడు యున్నట్టి పరిసర ప్రాంతంబునకు వచ్చెను.

కం. వచ్చిన మత్తేభము గని
యిచ్చగ ధనువెక్కు పెట్టి నేనుగు ఖతిన్
నచ్చటి రాజోద్యానము
చెచ్చెర జనె ప్రాణరక్ష జేయుతలంపున్

వ॥ ఇట్లు పరుగెత్తుచున్న నేనుంగుపై బాణజాలంబులు ప్రయోగించుచు దాని వెంటబడిన శ్రీనివాసుని కందక రాజోద్యానవనము జొచ్చి యదృశ్యమాయెను. శ్రీనివాసుండు గజముజాడ తెలియక ఉద్యానవనములో తిరుగాడుచుండు తరి అక్కడ స్త్రీల కలకలంబులు విన్నవాడై ఆదిశ కేగెను. అక్కడ ఆటలాడుచున్న స్త్రీలను గన్నవాడై తానున్నది ఉద్యానవనమని గ్రహించె. శరత్కాలపు చంద్రుని వన్నె మిన్నగా ప్రకాశించు పద్మావతిని గాంచి వారి క్రీడలను జూచి ఆనందించుచు తన దప్పిక మరచి శ్రీనివాసుండు.

ఉ. ఈ యలివేణి యెక్కడిదొ యీ తరుణీమణి చూపురేఖలున్
కాయజు ప్రేమభాగినియొ కాంచనగర్భుని రాగరాణియో
యీయమ హావభావముల నెన్నతరంబె మహేశుడైన నే
నీ యువతీ లలామ కర మింపుగ బట్టని జన్మమేలకో

ఆ.వె. జాణమోము జూడ చంద్రబింబముబోలు
చెలియ పల్కులెల్ల చిల్కనుడులు
వాలుచూపు లలరె వలరాజు తూపుల
హంసగమన లట్లు నామెనడక!

వ॥ ప్రేమాతుర మానస శ్రీనివాసుడా బాలామణి చూపు రేఖావిలాసంబుల మననజేయుచు వారి క్రీడాస్థలంబు జేర నా వన రక్షక యువతీజనంబు నివ్వెరపాటునంది నిట్లనిరి.

ఉ. ఎవ్వడ వే వనమాయకుడ వెందుకు వచ్చితివే మికారణం
ఇవ్వనభూమినందు వనితేతరు లుండ వశంబుగాదు నీ
క్రొవ్వడగించమే చనుము గొబ్బున యుంచుక
యుంటివేని మా
జవ్వని నిన్నుబట్టి ప్రభుసన్నిధి కంపును శిక్షనేయగా!

వ॥ అన శ్రీనివాసుండు చెలికత్తియలతో నిట్లనియె.

తే గీ. అందముల కాటపట్టగు యిందువదన
యినుప గజ్జెల తల్లి నా వెంటబడియె
ఉన్న సిరి నన్ను వదలగా నూతలేక
దేశదిమ్మరి నైతిని దిక్కు కనక

వ॥ నేను ఒకప్పు డష్ట శ్రీలతో తులతూగుచుంటిని. సర్వ లక్షణ సంపన్నుడనై సర్వాంతర్యామినై చరాచర ప్రాణులకు ప్రాణంబునై యుంటిని. కాని కాలవశముచేత లక్ష్మి నను విడనాడి నే నొంటరినై తిరుగుచున్నానని తెల్ప చెలికత్తె లిట్లనిరి.

కం. కలవాడనంచు నుడువుట
కలలోని సుఖంబుగాదె కాంతామణులన్
పలికింవగ నెపమెన్నిన
పలువా పొమ్మిక నసువులు బాయకమునుపే!

వ॥ నీవు కలవాడవో, పర్రిుడవో నీతోటి మాకేమి పని. ఇది రాణోద్యానవనము. యిందు రాణీ యామె చెలికత్తియలు

తప్ప యితరు లుండరాదని మా రాజశాసనము. నీ వెంత తొందరగా వెళ్ళిన అంత మంచిదని అతనిని పంపివేయ ప్రయత్నించిరి. కాని స్వామి తదేక దృష్టితో పద్మావతిని తిలకించుచూ- సుందరీ! నీ అందము జూచిన మునులకైన మన్మథవికారము కలుగకుండునా! నీ రూప లావణ్యము సాక్షాత్తు లక్ష్మిని బోలి యున్నది. నా మనసు నిన్ను విడిపోవ యిచ్చగించుట లేదు. నీయందు సంపూర్ణ లగ్న మానసుండ నయిన నన్ను వివాహమాడుమని తన హృదయ మందున్నది వ్యక్తపరచి ఇట్లనియె.

సీ॥ మదిరాక్షి నినువీడి మరలిపోవుదమన్న
 మనసు రాకున్నదే మందగమన
సుందరీ నీ మేని సొంపుగంబుల గాంచ
 సురల మానసములు మరులు రగులు
కమలాక్షి నీ వాడి కంటి చూపులతోడ
 కాలకంఠుడయిన కమిలిపోడె
నీ రూపు నీ చూపు నీ కుల్కు నీ తల్కు
 నిగమ సాత్విక బుద్ధి నీకు గాక

గీ. నితర కన్యల గనరాదు నిందువదన
ప్రేమ జిగు రొత్త ననునీవు పెండ్లియాడు
తాళజాలను మరుతాపు తాకిడికిని
బెంగ తీర్పవే యలివేణి ప్రేమమీర.

వ॥ ఓ ఇందీవరాక్షీ! నీ హృదయంబున నాకు కొంత చోటిచ్చి నన్ను నీ వానిగా జేసుకొన వేడుచున్నాను. దయ

చేసి నన్ను వివాహమాడుమని ప్రాధేయ పూర్వకంబుగా మందహాసంబుతో తన దరిజేరనున్న బోయను గాంచి పద్మావతి- ఓరి మూర్ఖుడా! ఏమి నీదు సాహసము! బోయవై దిరుగాడు నీకు రాకుమార్తె భార్య కావలయునా? నీ బుద్ధి వక్రించినట్లున్నదని పద్మావతి.

కం॥ రోషించి పలికె నప్పుడు
భాషించుచు చెలులతోడ ధూర్తుండితనిన్
దోషంబని యెంచవలదు
పాషండుని వెడలగొట్టు బడితలపూజన్

వ॥ అంత చెలికత్తియలు రాళ్ళతో వర్షము కురిపింపగా అమాయక యువతుల పండించ మనసురాక శ్రీనివాసుడు పద్మావతిపై ఓరచూపు విసరి మందహాసంబుతో ఆమెకు తన నిజరూపు మెరిగింప దలంచి.

కం. చూపించె విష్ణుదేవుడు
కోపించిన చెలి కనంగ కూరిమి నిజమౌ
రూపంబును పద్మకనుల
కోపంబించుక తలపక గోవిందుండున్

మ॥ కనియె న్నాతని శంఖచక్ర ధరునిన్ కౌమోదకీధారునిన్
ఘనయోగీంద్రుల కందరాని భవునిన్ కారుణ్యమూర్తిన్ హరిన్
అనఘాద్యంతము లేనివాడు సతమెయ్యాకారంబుగా లోక మం
దనిశం బాడుచు పాడుచుండు నతనిన్ అంభోధిజానాథునిన్

వ॥ శ్రీమన్నారాయణుని దివ్యస్వరూపావలోకనంబున విస్మితానంద భరితయై పద్మావతి యా దేవదేవుని స్తుతింప సాగెను.

సీ. నీవె అనిలుడవు నీవె భాస్కరుడవు
నీవె చంద్రుడవు నీవె జలము
నీవె పద్మజుడవు నీవె ఈశ్వరుడవు
నీవె సత్యంబును నీవె సృష్టి
నీవె విశ్వంబును నీవె అనంతుడవు
నీవె అణువణువు నీవె వెలుగు
నీవె మానవుడవు నీవు సురుండవు
నీవె జంతుచయము నీవె సకలము

తే.గీ. నీవు లేనిది ఈ సృష్టి నేదిలేదు
నీదు మహిమను తెలియంగ నేరనైతి
దుష్టబుద్ధిని ద్రోహిని ధూర్తమతిని
చిత్తశుద్ధినన్ క్షమియించు శ్రీనివాస.

వ॥ మరియు నిట్లు పొగడజొచ్చెను.

ఉ॥ శ్రీయుత ఇందిరారమణ చిన్మయరూపవిలాస సత్యనా
రాయణ! నన్ను బాయక విరాజిలుచుండుము నా
మనంబునన్
నా యపచారముల్ మరచి నమ్రము నివేదన
జేయుదోయి నా
ప్రాయము కాయ సంపదల భక్తి నొసంగుము
దీనపాలకా!

వ॥ ఆది మధ్యాంత రహితా! అనంతగుణ గంభీరా! నిన్నునే నెరుగక నీకు ద్రోహము చేసితిని. నన్ను క్షమింపు మని వేడుచుండగా పద్మావతికి మాయ గప్పినవాడై అదృశ్యు డాయెను. పద్మావతి పరమేశ్వరుని గానక తన చెలికత్తెల పై చూడగా చెలులు తన ప్రియునిపై శిలావర్షము గురిపించు చుండిరి. అది గాంచి నివ్వెరపడి చేయునదిలేక వికలమనస్కు రాలై గోవిందుని కాపాడ యత్నించుచు.

కం. అపుడమని ముందడుగిడు
ఆపిన తన చెలులచేత రసహాస్యములన్
ఆపకయుండిన శ్రీహరి
తాపంబు భరించలేక తడబడసాగెన్

వ॥ శ్రీనివాసుడు చెలికత్తియల రాళ్ళ దెబ్బలకు తాళ జాలక ఉద్యానవనమువిడచి తన పర్ణశాలకు దారిపట్టెను. తద నంతరంబు చెలికత్తియలు రాకుమారిని వెంటబెట్టుకొని రాణీ వాసమునకు విచ్చేసిరి. రాకుమారి హరిన్ గానక కరిన్ బాసి తిరుగు కరణుల తీరు ఘెన్నన యుల్లంబుఁ దల్లడిల్లఁ జిత్తం బును గోల్పడి వివిధ చేష్టలకుఁ బాల్పడి మదోన్మత్త చిత్తయై.

గీ.మా. తుడువదు కనులన్ వెడలెడి తోయకణము
ముడువదున్ఁ జక్కఁగా కొప్పు ముద్దుగుమ్మ
సిగన పువ్వుల బెట్టదు సిగ్గులాడి
పలుకరించదు చెలులను పంకజాక్షి

హాలతుల కసరుకొనుచు యా పువ్వుబోడి
నీరమైనను గ్రోలదు నీరజాక్షి
అన్న మినువంత కుడుమదు కన్నతల్లి
కయిన తెలుపజాలక భామ కసరుకొనును.

వ॥ అయ్యో! నేనెంత పొరబడితిని! ఆనాడు నా తండ్రి సమక్షమున నారదమహర్షి వచ్చి నా చేతిరేఖల జూచి— పద్మావతీ! నీ వెంత ధన్యురాలవమ్మా! నిన్ను బోలు స్త్రీలు ఈ భూలోకములో లేరమ్మా! నీలమేఘశ్యాముడు, ఆదిమధ్యాంత రహితుడు, అనంతగుణ గంభీరుడు, ఆ మహావిష్ణువు నే భర్తగా పొందెది భాగ్యమున్నది. నా నుడి వృథా గాదు. త్రికశుద్ధిగా నమ్ము మన నేను మందహాసముతో లోలోన నవ్వుచూ నా సంతోషమునకు మేర లేకపోయెను. నా దరికి వచ్చి నన్ను పెండ్లాడుమని కోరి వచ్చినవాని నే క్రూరచిత్తనై మనోవాక్కర్మల ననేకవిధముల నొప్పించిన దాన. అతడు నన్నెట్లు వివాహమాడగలడు. ఆ! నా ఈ సౌందర్యము ప్రయోజనం బేమి? ఆహా! ఏమి విరాట్ స్వరూపుని సౌందర్యము!

ఉ॥ నల్లని మేనువాడు కరుణామయు డార్తుల బ్రోచువాడు నా
యుల్లము నింపువాడు పరమోన్నత భక్తవశీకరుండు నా
చల్లని దైవమెల్లపుడు సజ్జన రక్షణ చేయువాడు పె
న్బల్లిదు డా మహాత్ముని భర్తగ బొందెడి భాగ్య
మెప్పుడో.

వ॥ ఆ వైకుంఠుని పై మనసు పడి కుసుమశరుని శర పరంపర బాధితయై నిటు విలపింపదొడగెను.

చం॥ మలగును చల్లగాలికిని మన్మదబారికి తాళజాలకన్
దలగును కోయిలల్ పలుక దద్దయు భీతిని బొందు గుండియల్.
ఘళ ఘళమంచు జల్లనగ బేలయి సోలుచు తూలుచు మ్మదిన్
మెలతయు పూలపాన్పుపయి మేనును వాల్చె ననంగబారికిన్

వ॥ అంత కొంత తరి పద్మావతి మన్మదావస్థనుండి తేరుకొన్నదయి తనలో.

ఉ॥ జాసల గూడి నేసచటు జాజుల గోయగ కొమ్మనొంచగా
భానుని తేజమో యనగ భాసిలుచుండెడి నిన్నుచూడగా
మేను గగుర్పొడెన్ మనసు మేదిని నిల్వక నాలో యేదియో
కానని కౌగిలింతలును కానగవచ్చెను నిన్నుజూడగన్.

ఉ॥ అక్కట యెందుకొచ్చె మరుసయ్యయు! వొచ్చెబో! చెట్టు చాటు నా
టక్కరి దాగెనెందుకు! తటాలున నా పరి కెందు కొచ్చెనో
మక్కువతోడనన్ గదిసి మానస ముబ్బగ నన్ ప్రియాయనన్
మక్కువలేక నే నితడు మందుడు పినిని కొట్టుచుంటినో

ధృవకోకిల : తెలివితక్కువ కారణంబున తృళ్ళిజేసితి తప్పు నే
చెలిమితో నిను వేడుచుంటిని చెచ్చెరన్ నను గావవే
తలిరుబోడిని గావమంటిని తప్పులెన్నుట పాడియే
వలచినానుర శ్రీనివాసుడ వచ్చి పెండిలి జేసుకో.

వ॥ ఆహా! నేనెంత పొరబడితిని! ఆ మధుసూదనుడు తనదరి కెట్లు రానిచ్చును? కఠినచిత్తనై, పాషాణహృదయనై, ధన మదాంధనై, కరకు రక్కసినై, జటిల మనస్కురాలినై, దుర్భాషినై, కపటినై నేను అన్న మాటలు సహించునా? సహించెపో! నా చెలికత్తెయలను రాజ్యాధికార మదముతో, రాకుమారిననే గర్వముతో, రాళ్ళతో కొట్టుమని యాజ్ఞాపించితినే! అది తా నెట్లు సహించు! సహించి తన దరి కెట్లు జేరనిచ్చును! జేరనిచ్చెపో! నన్నుతనదానిగా నెట్లు జేపట్టును. జేపట్టెపో. తాను నాతో ఎట్లు కాపురము చేయించుకొనును. ఇదంతా నా మనసును పూర్తిగా కలవరపెట్టుచున్నదే! హే కమలోద్భవా! నా తలవ్రాతనెట్లు లిఖించితివోయని తన మనస్సున పద్మావతి.

కవిరాజ విరాజితము :

సరసిజనాభ విచారము నొంటకు సన్నుతిజేతుర
సమ్మతితో
కరములు మోడ్చితి కావన బోకుము కష్టమునంబును
గైకొనుమా
మరులనుగొంటిని మందమతిన్ నను మారునిబాణము
మచ్చరియై
పరువును నిల్పుము పద్మజా పూజిత పాప వినాశన
పాయకునన్

వ॥ ప్రభో! నాపై పంతముతో నన్ను నీ దానిగా అంగీకరించని యెడల నా నిర్ణయము విను.

చ॥ తపములు జేసియైన ధనదానము జేసియునైన నేమదిన్
జపములు జేసియైన నిజశక్తిని భక్తిని నిన్ను బట్టుదున్
చపలత జేర నెన్నటికి చంచల చిత్తను కాను మాధవా
కపటిని కాను నా హృదయకౌముది గాంచుము
శ్రీనివాసుడా!

వ॥ అని పద్మావతి మారుని బాణముల కోర్వజాలక మన్మథా! అసమర్థులయిన ఆడవారిపైన నీ ఘనతనంబు జూపింతువా యని.

కం. సిరులిచ్చే తల్లి గలదని
మురిసిన గర్వాంధమతివి మోహావర్తిన్
దరిగానని అబలలపై
విరిబాణము వేయ సిగ్గు విడియము లేదా!

వ॥ ప్రద్యుమ్నా! మీ తాతగారి కులము స్వచ్ఛమయిన పాలవంటి కులము. అట్టి కులములో మీ తల్లి జనించినది. యామెకు నీవు పుట్టితివి.

ఉ॥ అచ్చపు పాలసంద్రమున కాత్మజ లచ్చిమి నీకు తల్లి తా
నెచ్చటి కేగునో యెరుగ ఇందిర చంచలచిత్త యామెకు
న్నిచ్చ పలెర్వ బుట్టితివి ఇంతుల పై పగబూని తుంటరీ
గ్రుచ్చెద వేల మానసము కుచ్చితబుద్ధిని పూలబాణముల్

వ॥ ఓరీ ప్రద్యుమ్నా! నాపై పగబూని కఠినచిత్తుండవై నీ చిలుకల బలగముతో వచ్చి తియ్యని విల్లు ప్రయోగించి పువ్వులబాణముల నా వక్షంబు బద్దలు గొట్టి బాధింతువా! ఇది నీకు పాడియా? ఆనాడు ముందువెనక లాలోచించక కాలకంఠునిపై వైరము బూను యత్నంబున నాతని కంటి మంటలకు దగ్ధంబై అనంగుడవైతివి. అప్పుడే మరచితివా? ఏ మహాసాధ్వి కంటిమంటలకు భస్మమయ్యెదవో పలువా!

సీ. ఎనలేని మగటిమి ఘనుడ నేనని యెంచి
మిడిసిపాటేలనో గడుసువాడ
పగబూని యతివల పంతంబు తోడుత
పలువరించగజేయ పాడియగునె
కలుముల జవరాలు కడుముద్దు బిడ్డవై
కనికరంబే లేదు కఠిన మనసు
వావివరుస లేదు వలరాజ నీకును
తోడబుట్టువునైన తొగలనేతు

తే.గీ. తల్లిదండ్రియు గురువునుం తనయులాది
అలరు విల్తుడా నీధాటి కదరిపోరె
కటకటా దయలేని నీ కఠినగుండె
నీతిహీనుడా నీ మేను నేలగూల.

వ॥ ఇట్లు పద్మావతి మకరకేతుని దూలనాడుచు పర ధ్యానమునుండ చెలికత్తియలు యామెను చుట్టుముట్టి నీ విట్లు వస్త్రాభరణములు ధరియించక, మాతో మాటలాడక, ముమ్మ

పలుకరించక, మా సేవ లందుకొనక యుండుటకు కారణం బేమి? మేము నీ తలపులోని వారముకదా! ఎప్పుడు నీ మేలు కోరువారము. నీ మనసులోని మాట మాకు చెప్పుమన పద్మావతి ఇట్లనియె.

ఉ॥ మెచ్చెడివారు లేక ననిమేష మహత్తుల గాంచలేక నే
మచ్చిక జూపలేక నను మాయల మాటల మభ్యపెట్టి నా
పిచ్చిని గేలిసేయ తలపెట్టకు బేలను మీరు నాస్త్రముల్
గ్రుచ్చిన మానసంబున నకుంఠిత బాధచెలంగె
నిత్యమున్.

వ॥ ఓ నా యనుంగు చెలియలారా! నేనిక తాళలే నమ్మా! ఆ రోజు ఉద్యానవనమందు కనిపించి నాతో మాటలాడి నన్ను పెండ్లి జేసుకొమ్మని బ్రతిమలాడిన రాళ్ళతో కొట్టితిమే ఆ మహాపురుషుడే నా మనసుదోచిన ఘనుడమ్మా! ఆహా! ఏమి అతని సౌందర్యము! కోటిసూర్యప్రకాశమానమై అలరారుచున్న ఆ రూపురేఖలను వర్ణింప ఆ ఆదిశేషునకైన నలువ పడతికైన తరమగునా!

ఉ॥ ఎన్నడు జూతు ముజ్జగము లేలెటి దేవర మోము
సొంపు నిం
కెన్నడు వచ్చు నా దరికి ఏగతి నాతని కౌగిలింత న
న్నెన్నడు జేర్చు నా మదన మధేచ్ఛగ శ్రీహరి
తాళిబొట్టు నా
కెన్నడు కంఠమందిడునొ యెల్లరు సేసలు జల్లజూతునో

వ॥ అని పద్మావతి విలపించుచుండ చెలికత్తియలు అమ్మా! నీవు బేలవై యిట్లు విలపింప ప్రయోజనంబేమి? నీవు కాత్యాయనీ వ్రత మాచరించిన నీ కోర్కెలు సిద్ధించు. తొల్లి రుక్మిణీదేవి కాత్యాయనీ వ్రత మాచరించి శ్రీకృష్ణుని పెండ్లి యాడె. కాన నీవు ఆ రాజరాజేశ్వరి వ్రత మాచరించిన నీ కోర్కెలు సిద్ధించునన కాత్యాయనీ వ్రతనిష్ఠ బూనినదై పద్మావతి దేవిని పూజింప దొడంగెను.

ఉ॥ నమ్మితినమ్మ నిన్ను మది నా ఇలవేలుపు నీవెయంచు నే
నమ్మితినమ్మ ఈశ్వరీ సనాతనుడైన యుమామహేశ్వరీ
నమ్మితి శ్రీనివాసులను నా పతిగా ఇతఃపూర్వ నిన్ను నే
నమ్మితి మేనకాత్మజ యనాథలఁ గాచు దయా
స్వరూపిణీ!

వ॥ ఇట్లు పద్మావతి వ్రతనిష్ఠ బూనినదై రాజరాజేశ్వరీ! అపర్ణా! పార్వతీ! ఉమా! కాత్యాయనీ! గౌరీ! కాళీ! హైమవతీ! ఈశ్వరీ! భవానీ! శర్వాణీ! మృడానీ! అంబికా! మేనకాత్మజా! అంటూ వేనోళ్ళ పొగడుతూ తదేకదృష్టితో నలభై దినములు రాజరాజేశ్వరీ వ్రత మాచరించెను.

కం. పుష్టిగ శ్రీ విష్ణు కథల
నిష్టముగా జదువ వినగ నీప్సిత మబ్బున్
కష్ట పరంపర దొలగును
అష్టైశ్వర్యంబు లమరు నాయువు పెరుగున్

: గద్యము :

ఇది శ్రీ పరమేశ్వర కరుణా కవిత గుంజపల్లి వంశ గౌండ్ల
కుల పావని చంద్రుండు యీశ్వరభక్తుండు సంగీత సా
హిత్య దురంధరుండు సచ్చీలుండు యాదిగె యంగన్న
ధర్మపత్ని మంగమ్మగార్ల ప్రథమ పుత్రుండను
పురుషోత్తమగౌడు నామధేయుండ
కె.ఆర్. మధుతేటి కవిగారి ప్రియ
శిష్యుండనగు నా ప్రణీతంబు
నందు తృతీయాశ్వాసము
సంపూర్ణము.
ఓం

# చతుర్ధాశ్వాసము

కం. వేంకట రమణా వేడితి
సంకటముల బాప నిన్ను సన్నుత చరితా
వంకల నెన్నకుమయ్యా
శంకరభక్తుండ నన్ను సత్కృపగనవే.

వ॥ ఇట్లు సూత మహామునిని శౌనకాది మహామునులు తర్వాత కథ చెప్పవేయని యడుగ సూతుడిట్లు చెప్ప దొడంగెను. పద్మావతి యాజ్ఞమేరకు చెలికత్తియలతో రాళ్ళదెబ్బలు తిని చేయునదిలేక తిన్నగా పర్ణశాలకు వచ్చి చింతావిపగ్రమాన సుండై శ్రీనివాసుడు పద్మావతిపై మనసుపడి ఇట్లు పలపింప దొడంగెను.

సీ. చెలియ నెమ్మోమున చంద్రబింబపు కాంతి
చూడని కన్నుల సొగసదేల
కలికి వాగ్ధారల కరిగిన చక్కెరల్
జుఱ్ఱుకోజాలని సుఖమదేల
యెలనాగ బిగి కౌగిలెదకొత్తుకొనలేని
యెదనంటు మరుతూపులెదలు పెట్లు
చెలువ శృంగారంపు కులుకుల దేలక
పెడలింటి విరహాగ్నినుడుగు పెట్లు.
తే.గీ. మేలు బంగారుబొమ్మగా మేనిచాయ
కులుకు లొలికించు ముద్దులగుమ్మపైన
యిచ్చలను హెచ్చిపెచ్చయి గ్రుచ్చనెపను
మరుపురాకుండె మదిరాక్షి మనసునందు.

ఉ. ఆ కడగంటి చూపులును ఆ మృదుకోమలదేహ
కాంతియున్
ఆ కుచ కుండలంబులును ఆ ముఖకోమల
చంద్రబింబమున్
ఆ కర పల్లవంబులును ఆ సుగుణంబులు వాక్కులున్
మరిన్
ఆ కురు లందచందములు హాటకగర్భుడు చెప్పనోపునే

కం. కుందనపు బొమ్మ నా పయి
మందుల నేమయిన జల్లి మరుల గొలిపెనో
డెందమ్మును సందడి గొని
కుందెను మదనాగ్నికీల కోమలి కొరకై

వ॥ ఇట్లు శ్రీనివాసుండు చింతానిమగ్న మానసుండై వ్యాకులచిత్తుడై, తనను పద్మావతి చెలికత్తియలు రాళ్ళతో కొట్టిన గాయములతో బాధపడుచుండ వకుళాదేవి కుమారుని గాంచి, నాయనా! పలదన్నా వేటకు వెళ్ళితివి. అయ్యో! నీ సుకుమార దేహమును గాయపరచగా నా దుర్మార్గుల చేతు లెట్లాడెనోగదా యన శ్రీనివాసుం డిట్లనియె.

కం. కంటిని నేనొక లేడిని
కంటికి నింపైన పసిమి కాంక్షల కాంతన్
జంటగ నా హృదయేశ్వరి
వెంటన్ కొనిరాదలచితి విఫలుడనైతిన్.

వ॥ నాయనా! ఆ లేడి నీ కందకపోయెనా ఏమి? యని వకుళాదేవి యడుగ శ్రీనివాసుడు అవునమ్మా! కోటి సూర్య ప్రకాశమానమై తేజోసంపద సోయగంబుల దేలుచున్నది.

కం. చన్నులు పువ్వులబంతులు
కన్నులు తెల్లని కలువలు కన్నియ పిఱుదుల్
పెన్నేటి ఇసుకతిన్నెలు
కన్నియ నా మనసు దోచె ప్రౌఢపు శక్తిన్.

కం. అమ్మా వినవమ్మా మా
యమ్మా ముద్దులొలికెటి యమ్మా పొమ్మా
యిమ్మహిరాజును కన్యను
యిమ్మని అడుగమ్మ వకుల యిలవేల్పమ్మా!

వ॥ అమ్మా! నీవు రామాపురము వెళ్ళి ఆకాశరాజును తన కూతురు పద్మావతిని నా కుమారునికి ఇచ్చి కల్యాణము జేయించుమని కోరుమనగా తల్లి ఇట్లనియె.

కం. వద్దుర నాయన నీకీ
బుద్ధులు పెద్దలతో వియ్యమొద్దుర కుఱ్ఱా
యిద్దర నేలెటి వారల
కు ద్దగుదుమా బాబూ మనకా వఘువున్ వద్దూ.

వ॥ నాయనా! అడవులం దాకులలములు తింటూ కాలము గడుపుతున్న మనమెక్కడ! భోగభాగ్యాలతో తుల తూగు మహారాజు లెక్కడ! హంసతూలికా తల్పముపై బరుండెడి వారెక్కడ! పటికనేలలపై శయనించు మనమెక్కడ!

నింగినేలకు పొత్తుకుదురుట సంభవమా? అంతరా తెరుగని యాశ అనర్థదాయకము. కాన నీ ప్రయత్నము విరమించు కొనుము. మన కనుపైన వధువునెన్నుకొందమనగా శ్రీని వాసుం డిట్లనియె.

కం. అమ్మరో చెప్పెద విను నీ
కమ్మని కథలన్ని నమ్మ కౌతుకమొప్పన్
ఇమ్మహి కొత్తమ్మవె నా
కమ్మవు నందుని యశోదవమ్మా మునుపున్

వ॥ అమ్మా! నీవు నాకు ఈనాటి తల్లివికావు. మున్ను ద్వాపరమున నే గోపాలుడనై కృష్ణావతారమున నున్నపుడు నన్ను పెంచి, పెద్దజేసి, నా కల్యాణము జూడవలయునను కాంక్షతో కన్నుమూశావు. ఆ కోర్కె తీర్చుకొనుటకు నీవు వకుళాదేవివై అవతరించినావు. నీకు జ్ఞాననేత్రంబు ప్రసాదించితి చూడమన, పరమానంద భరితురాలై మేను గగుర్పొడ, యుల్లంబు సంతసంబున మున్గిపోవ, తన భాగ్యమునకు పొంగిపోయి, తన జన్మ ధన్యమాయెనని యెంచి, పూర్వజన్మ వృత్తాంతంబు జ్ఞాననేత్రంబుతో చూచి పరమానందంబుతో ఇట్లు స్తుతించెను.

కం. నందయశోదల ముద్దుల
నందను మందమతి నిన్ను నందను దనుచున్
డెందంబున దలపోసితి
ఇందిర హృదయేశ్వర నిజ మెరుగము తండ్రీ.

మ. త్రిజగన్మోహను మాతృదేవియగు నుద్దేశ్యంబు ధన్యంబయెన్
నిజదేహంబున మోక్షధామమరయన్ నిత్యానుకంపానిధిన్
సుజనుల్ నీ శుభ పాదపద్మయుగళిన్ స్తోత్ర ధ్యాన యోగంబులన్
భజనల్ జేసి నిరంతరంబు తరియింపన్ గాంతుమో మాధవా!

వ॥ వైకుంఠా! వాసుదేవా! నీ దివ్యదృష్టివలన నాకు జ్ఞానము ప్రసాదించితివి. పాపభూయిష్ఠంబయిన ఈ ప్రపంచంబునందు ఇంక నేనుండనొల్లనుగాన నాకు పునర్జన్మరహిత పరము ప్రసాదించుమన శ్రీనివాసుండు. అమ్మా! నీకు జన్మలుండవు. నీవు నా కల్యాణము జేసి స్వీయాభీష్టము ననుసరింపుము. మున్ను నీవు నా కల్యాణము జూడవలయునని కోర్కె యున్నదని నా కెఱింగించితివి. కాన నా కల్యాణము చేయించి, చూచి, ఆనందించు మన పుత్రుని కౌగిలించి ప్రస్తుతించి ముద్దాడి ఇట్లనియె.

ఉ. చొక్కపు చీకటిన్ బడియు జోటినై జోడను చెట్టవట్టియున్
నిక్కపు భర్త మోహమున నిచ్చలు దేలుచు మోహవాంఛతో
మక్కువ నిన్నుగొల్వ కను మత్తిలి కాయము నిక్కమంచు నే.
నొక్క నిమేషమున్ మదిని నొక్కియు వేడను నిన్ను నీశ్వరా!

వ॥ అని తల్లి తనయుని కోర్కె నెరవేర్చుటకుగాను ఆకాశరాజు కడ కేగుదునన శ్రీనివాసుం డిట్లనియె. అమ్మా !

ఉ. కన్నియమీద నా మనసు ఘాఢము కూరుకురాదు రేయి యూ
కన్నియ నాకు దక్కనెడ కాయము నిల్వదు నిక్కమిద్ది యూ
వన్నెల కన్నెకున్ మరుని వాంఛలు దీర్చుట ధర్మమంచు నా
వెన్నెల రాణికిన్ దెలిపి వేగమె పెండ్లియుజేయవేఇలన్

వ॥ అమ్మా! ఆ కన్య నా కొరకు నొక జన్మమంతయు తపస్సు జేసినది. ఆమె నా గురించి గొప్ప త్యాగముగూడ జేసినది. అందులకై ఆమెకు నేను మిక్కిలి ఋణపడియున్నాను. కాన నీవు రామాపురము వెళ్ళి ఆకాశరాజుకు నా వృత్తాంతము దెల్పి పెండ్లి నిశ్చయముజేసి రావలయును యనగ వకుళ నా కెంతటి భాగ్యము కల్గినదని సంతోషించి రామాపురము బయలుదేర ప్రయాణంబవుచుండ అప్పుడు శ్రీనివాసుండు వకుళామాలినియగు తనతల్లి రాజధాని వెళ్ళకమునుపే ఒక వింత గావించవలయునని తాను ఎరుకలసానివేషము వేయ నారంభించెను.

సీ॥ గళసీమనందున కౌస్తుభమణిలేక
పూసలహారాలు పూన్చె మెడను
నెమలిపింఛము దీసి నెసరొప్ప ముత్యముల్
చుట్టిన చుట్టను పెట్టె తలను

పీతవసనునకు ప్రీతిగా బంగారు
వలువను వలపులో వగలగట్టి
ధగ్రని రవికెకు యెదచుట్టు గవ్వలు
పూర్చిన చనుకట్టు కూర్మిగట్టి

తే గీ. పెద్ద కుంకుమబొట్టును ప్రీతిబెట్టి
కాళ్ళ గజ్జెలు గొలుసులు కడియములు
వెండి వడ్డాణంబు కటిని వేడ్కనుంచి
మెడను వెండికంటెము చేత మెలుకర్ర

సీ.మా. వ్రేళ్ళ వెండి యుంగరములు వెలుగుచుండ
తలను సోదిబుట్టను బెట్టె తరుణియప్పుడు
యెదుట చెప్పెడు ఎడలోని మరుము మంచు
మాయ యెరుకలసానియై మరుని తంత్ర
బయలుదేరె వసుధ కాంతిప్రభలు వెలుగ
రాజనగరంబునందున రాజవీధి
తిరిగి తా త్రికాల ఫలము తెలుపు చుంచు
కేకవిడుచుండ రాణియు కీలకంబు
లన్ని చెప్పెదనని కేకలరచు దాని
పిలువడంచన దాసియు పిలచెనప్పుడు

వ॥ అప్పుడు యెరుకలసాని రాణివాస భవనంబునకు రాగ యామెకు దర్భాసనంబువైచి కూర్చుండని యోగించిన యది నిట్లనియె.

ఉ. చక్కదనంబు జవ్వనము జాణతనంబున మేలుబంతి శ్రీ
చక్కని పన్నెలాడి బహు సాత్త్విక బుద్ధిని ప్రీతిమీర నే
మక్కువ పెంచితిన్ మరియు మంగళ మానసపుత్రికాఫలన్
దక్కిన ముఖ్యకారణము చెప్పుము చింతిలుచుండు ఏలకో

తే.గీ. గాలిసోకెనో రేపను ధూళియానో
తలపు లొలుకంగ పెఱులతో తలపునిడదు
అన్నమేమియు తినవదు నడుగుతావె
మందు లెన్నెన్నొ వాడిన మార్పులేదు.

ఉత్సాహము : కుందనంపు బొమ్మవంటి కూతు కుందుచుండె నెందుకో
మందు లెన్ని వాడినాను మందలించి చూచితిన్
డెందమందు చింతపోదు డిల్లపడును యేలకో
వందనంబు చేతు నీకు వగపు మాన్పు జెప్పవే.

వ॥ అని ధరణీదేవి పళ్ళెరంబున ముత్యంబులు పోసి బియ్యము పేడలు మొదలగు సంభారంబులం నింకొక పళ్ళెరంబున నిడి దక్షిణ తాంబూలంబుల, నారికేళ, ధూప, దీప నైవేద్యంబులు పెట్టి, మంగళహారతి సమర్పించి చెప్పవే చిన్నారి యెరుక చెప్పుమని కోరగా యెరుకలసాని గద్దె చెప్ప నారంభించెను.

## ద్విపద

చెప్పెద వినవమ్మ చెవుల కింపుగను
తప్పేమి జెప్పను తరళాక్షి వినవె
తల్లి సరస్వతీ తలపులో నిలువు
పొల్లేమి బోకుండ పొలతికే చెప్పుదు
అమ్మ లక్షిమిదేవి అనుమతివ్వమ్మ
కొమ్మ మనసునందు కుమిలేటి వ్యథల
కొండదేవర నీవు కొండదిగవయ్యా
మెండైన నాసోది మేటియై యుండ
సోదిబుట్టాతోడు నాసోది నిజము
పదిలంబుగా విను పంకజాక్షిరో
గాలి ధూళి యనుచు గాసిల్లకమ్మ
గాలి లేదమ్మరో గడుసరే తల్లి
పూలతోటందునన్ పూజ్యునిన్‌గాంచి
కలవరంబొందెనే కల్యాణి మనసు
బోయవాడంచున్ బిడియంబువలదు
బోయగాదతడులే భోగి పొన్పగును
ఆదివిష్ణువతడు అందగాడమ్మ
మైదుకంబున బాల మనసిచ్చెనమ్మ
దేవదేవుడతడు దేవళ్ళమేటి
సేవజేయుదురమ్మ జేజేలు నతని
అల్లుడవును నీకు ఆ మహావిష్ణు
కల్లగాదమ్మ ఈ కలకంఠి మాట

వైకుంఠవాసుడే వలచినాడమ్మ
నీ కోర కాతడు నిలచినాడమ్మ
రాముడై పుట్టియు రావణున్ జంపి
ప్రేమార సీతనూ ప్రేమించినాడు
కృష్ణుడై పుట్టియు కష్టముల్ బాప
దుష్టకంసుని జంపి దురితంబు బాపె
నిద్రాహారము మాని నిలచాడె తల్లి
నీ దరి కొచ్చునే నీలమేఘుండు
మరునయ్య తండ్రియా మగసిరి ప్రౌఢ
కాడుపాతలు కావు కామాక్షి వినవె
నీ చింత తీర్చునే నిజము నామాట
వాసింత సెప్పరా కాంత ఒకతొచ్చు
రాయబారంబుకు రానున్నదమ్మా
కాయమా నీ పెండ్లి కల్యాణి కమ్ము
నీ కోర్కెదీరునే కుందకే యింతి
నాకేమి ఇత్తువే నా యమ్మ తెల్పు.

వ॥ అని మాయ యెరుకలసాని గద్దెజెప్పి తనకు పెట్టిన దక్షిణ తాంబూలాదులు ధనకనకవస్తువులన్ని బుట్టనందిడుకొని ధరణీదేవికి నమస్కరించి- అమ్మా! నేను మరలా నీ పాతురు పెండ్లికి తప్పక రాగల, నపుడే మిత్తువో తల్లియని మాయ ఎరుకలసాని వెడలిపోయెను. తదనంతరంబు రాణి ఈ వార్త రాజున కెరింగించెను. ఈ కథ ఇట్లుండ అక్కడ వకుళాదేవి రామాపురము ప్రయాణమునకు సిద్ధమగుచుండెను.

కం. అప్పుడు వకుళాదేవియు
గొప్పన పయనంబునయ్యు గోవిందుని మనం
బొప్పంగ జేయగ దలచి
చిప్పిల రామాపురంబు శీఘ్రమే జనగన్.

వ॥ ఇట్లు వకుళాదేవియు పయనంబై రామాపురముదారి బట్టి అక్కడి కొండలు, గుట్టలు, నదులు, దాటుచు ప్రకృతి వైభవంబు తిలకించుచు అబ్బురపడుచు ఈ విధంబుగా వర్ణింప సాగెను.

సీ॥ కాంతార వైభవం కన్నుల కింపుగా
కనకాంగి కప్పుడు కానిపించె
కలకంఠుల ధ్వనుల్ కమనీయమై వెలయు
కలకంఠిమానసం కరిగిపోయె
కాసారముల నీరు కడుపుబ్బగా త్రావి
కరిరాజు కదులతో కలసినడువ
కమలాల మధుజుఱ్ఱి కైపులో చంచరీ
కమ్ములు జుమ్మని గానమూద

తే.గీ. కాన! లేతచిగుళ్ళతో కానుపింప
పసిడి మయమయ్యె అడవియు పసదలిర్ప
కొండవాలున దిగజారి గుండ్లుదిరిగి
పారు సెలయేటి రవముల పడతిగనియె

తే.గీ. కొండదొరలును ఎత్తైన కొనలందు
విల్లు లూనియు మూపున పెళ్ళుమంటు
అకట క్రూరమృగముల వేటాడుచుండ
వెంగుమంటును హరిణముల్ చెదరిపోయె

వ॥ ఇట్లు కన్నులపండువుగా వకుళాదేవియు వనమును తిలకించుచు

ఉ. ఇచ్చట నేగదా తపను లెండల వానల చల్లగాలియున్
దిచ్చతో భక్తిమార్గమున నీశ్వరుగొల్చియు ముక్తిజేరగా
యిచ్చలు మాని నెచ్చెలుల ఇచ్చలకెల్లను నాస్తియంచు
యా
తుచ్ఛపు కోర్కెలన్ బడక తోరపు బుద్ధితో ముక్తికేరెగ

వ॥ అని దారి నడచుచూ సూతులుం గలువంగ, చూత, భల్లాత, పనస, బదరి, వకుళ, వంజుల, వట, కుటజ, కురువక, కురంటక, ఖర్జూర, నారికేళ, చందన, మందార, జంబూ, జంబీర, మాధవీ, తాళ, తక్కోల, తమాల, రసాల, సాల. బిల్వ, కదంబ, కదళీ, అశోక, నాగ, పున్నాగ, చంపక, శతపత్ర, మల్లికా, ప్రముఖ, నిఖిల. నిర్మలానందకాదృశ్యంబులు, భయంకర పర్వతారణ్యంబుల సౌందర్యంబు తిలకించుచు కపిలేశ్వరము చేరెను. అప్పుడు సూర్యుడు అస్తమించగా ఆ రాత్రి అక్కడనే నిద్రించి బ్రహ్మముహూర్తమున లేచి కపిల తీర్థమునందు గ్రుంకులిడి, కపిలేశ్వరుని సన్నిధానమున కేగి సభిషిక్తున్ జేసి పూగుచ్ఛములతో నలంకరించి ఇట్లు ప్రార్థించెను.

-: దండకము :-

హిమగిరినివాసా! మహేశా! పరంధామా! గంగాధరా! శంకరా! కాలకంఠా! త్రిశూలధరా! హే గిరీశా! మహేశా! గౌరీశా! మహాదేవదేవుండ నీవేనయా! ఉమావల్లభా! ఉగ్రరూపాయ! అనంతాయ! భీమాయా! శాంతస్వరూపాయా! భక్తప్రియా! నీ సాటి లేరోయి ఈరేడులోకాల, ఈ నశ్వమందునా, రుద్రాయ! రౌద్రాయ! దక్షుండు నీమీద ద్వేషంబుతో, యాగమున్ జేయ, దాక్షాయణి నీన్ గోర, దాక్షిణ్యముతోడ యజ్ఞంబునకు బంప, ధూర్తుండుయై తండ్రిమాలంగనాడంగ రోషంబు, కోపంబు, తాపంబునిన్ బూని విద్వేషి యజ్ఞంబు నందేని యోగాగ్నిపుట్టించి, ప్రాణంబులన్ విడ, భూతేశు డుగ్రుండునై యార్చి ఆకాశమున్ దద్దరిల్లంగ ఘీంకారమున్ సల్పి, కోపంబువన్, జుట్టు నేలంబడన్ నేయ నందుండు ద్భవంబయ్యె నా వీరభద్రుండు నన్నేల పుట్టించితీవంటు వేడంగ, దుష్టుండు, మత్తుండు, క్రూరుండు, దాక్షాయిణీ తండ్రి నా మీద వైరంబు గావించు యజ్ఞంబు నాశంబునున్ జేసి రమ్మంచు జెప్పంగ వేవేగ యజ్ఞంబు నాశంబు గావించి, లోకంబు కల్యాణమున్ జేసితో, భక్తుండు వేడంగ, ప్రాణంబు లిచ్చావు. దుష్టుండు కోరంగ నీ రాణి నిచ్చావు. కాముండు నీపైన కామాస్త్రమేయంగ, యుగ్రుండవై, నీవు నీ కంటిచూపుతో, దగ్ధంబు గావించి, గర్వంబు బోజేసి, మృత్యుంజయా! నిన్ను ఎల్లప్పుడున్ గొల్తు గంగాధరా, శూలీ, విశ్వేశ విశ్వాత్మ, విశ్వంభరా, పాహి నా బిడ్డ కల్యాణమున్ జేయ నే బోవుచున్నాను.

నీ సాయముంగోరి నిన్వేడుచున్నాను. ఓ దేవదేవా! నమస్తే నమస్తే నమస్తే నమః.

వ॥ అంత వకుళాదేవి కపిలేశ్వరుని పూజించినదై, మౌనముగా దేవాలయమునందే పద్మాసనాసీనురాలైకూర్చుని ధ్యానించుచుండ, ఈః కథ ఇట్లుండ అక్కడ ధరణీదేవి దాసీజనముల భూసురకన్యల రావించి కపిలేశ్వరు నారాధించిన పద్మావతికి గ్రహదోషంబు దొలగి శాంతి గలుగునని

కం. అంతట ధరణీదేవియు
న్నింతులు దరిజేర రాణి ఈశుని గొరన్
సంతోషంబున పూజలు
సంతంబున సేవ.జేయ పద్మకు శుభమౌ.

వ॥ అని చెప్ప దాసీజనము భూసురకన్యలు కపిలేశ్వరు నారాధించుటకై కపిలతీర్థంబునకు జని దైవసన్నిధి పద్మావతి సుఖశాంతులకై ఈశ్వరు నభిషేకించి అందున్న వకుళాదేవి చెంత కూర్చుని ఇట్లు ప్రశ్నింపసాగిరి.

ఉ॥ ఎవ్వరవమ్మ నీవు కపిలేశుని సన్నిధి జేరి ఒంటిదానవై
యివ్వనమందు నీవిటుల నెచ్చటి కేగదలంచితీవు మా
నివ్వెరపాటెరింగి నిక నేమియు చింతలు లేక జెప్పు మా
యవ్వకు జెప్పి నీ పనిని యందలమెక్కగ జేతుమో సఖి.

వ॥ అన వకుళాదేవియు నిట్లనియె.

తే.గీ. నేను శ్రావ్యార్థ మెచ్చితి నెయ్యమొప్ప
రాణి చెంతన సకలంబు రహిజెలంగ
మంతనంబులఁ జేతు సమ్మతితోనంచు
అనునయంబున వారితో నవ్వ బలికె.

వ॥ మీ రెవ్వరని వకుళాదేవి అడుగ

తే.గీ. అమ్మ జెప్పెద నమ్ముము నెమ్మదిగను
యిమ్మహీనాథుని సతికి నిచ్చకముల
జెప్పి కనుసన్నల మెలంగు చేడియలము
ఈశు నభిషేక మొనరించి వేగవలయు.

వ॥ అని రాణి చెలికత్తియలన, అమ్మా! మీకు పుణ్యము ముండును, నన్ను రాణివాసంబునకు దోడ్కొని పొండు, మీ మేలు నీ జన్మలో మఱువనని వేడుకొనగ వారందుల కంగీకరించి నామెను వారి వెంటనిడుకొని రాణి మందిరంబున కేగిరి. అప్పుడా చెలికత్తియలు అమ్మా! నీతో మాటలాడగా నొక వృద్ధవనిత వచ్చినదన యామె ఆశ్చర్యచకితురాలై సోది జెప్పిన మాట నిజమాయెనని సంభ్రమాశ్చర్యంబులతో సగౌరవంబున మామెను తోడితెచ్చి రత్నపీఠంబుపై కూర్చుండబెట్టి అతిథి సత్కారంబుల గావించి ఉపచర్యలు జేసి క్షేమసమాచారంబు లడిగి రాజును పిలువనంపిన రాజు వచ్చి వకుళాదేవికి నమస్కరించగా, వకుళాదేవి రాజుకు ప్రతినమస్కారంబు లాచరించగా యామె యూరుపేరాది వివరంబు లడుగుచు రాజిట్లనియె.

ఉ॥ ఎక్కడనుండి వచ్చితివి యే పని వచ్చితో ముచ్చటించు నీ
వొక్కతె యింతదూరమిటు నోరిమితో చనుదెంచినావు నీ
కిక్కడ కార్యమేది గల దిచ్చలవేమిటొ సంశయింపకన్
గ్రక్కున జెప్పు వేడుదు నిరంజనమానస వృద్ధమాతరో.

వ॥ అని రాజు వకుళాదేవిని వినయపూర్వకంబుగా నడుగ వకుళాదేవి యిట్లనియె.

ఆ.వె. వినగ వేడుకొందు వీనులవిందుగా
చల్లకొచ్చి దాచజాల ముంత
నీ కుమార్తె నిచ్చి నా కుమారు పెండ్లి
జరుప వేడుకొందు సాధుశీల.

వ॥ రాజా! నా కుమారుడు సామాన్యు డనుకొంటివేమొ.

సీ॥ పురిటింట జిక్కిన పూతనను వధించి
మించు బాధల తొలగించినాడు
కంసాది క్రూరుల గర్వంబు నణగార్చి
దుష్టబుద్ధులనెల్ల దునిమినాడు
గో జనంబుల గావ గోవర్ధనంబును
నిర్భీతి గోటిపై నిలిపినాడు
అత్తకిచ్చిన మాట నాచరించుట కయి
నూరుతప్పుల దాక నురుము సంచు

తే.గీ. సాటుఒకటైన చక్రాన గీటడంచి
దుష్టవీరుల నెల్లర దునిమినాడు
చచ్చిన గురుసుతుని తెచ్చియిచ్చినాడు
నిజము నామాట యో రాజ వినుము లోక
సుందరుండు ముల్లోకాల కందగాడు
కుసుమకోమలి నీబిడ్డ గోరినాడు

వ॥ రాజా! నా ముద్దుబిడ్డడు సకలసద్గుణ సంపన్నరాశి.

తే.గీ. కులము కలిమి బలిమి తాల్మి కూర్మి జవ్వ
నంబు సుగుణంబు ప్రౌఢతనంబు తెంపు
తెలివి జౌవయు చెలువమ్ము తేజరిల్లు
దిట్ట సరిజోడు వాడు నీ పట్టి కనఘ.

వ॥ రాజా! నీవు భాగ్యశాలివి. నా కుమారుండైన శ్రీనివాసుడు త్రైలోక్యసుందరుండు. పూజనీయుడు. దైవాంశ సంభూతుడు. సమస్త రాజ రత్న శోభితుడు. ఓయుస్తై మీ ఉద్యానవనమున తిరుగాడుచూ నీ పుత్రిక పద్మావతిని గాంచి సాక్షాత్తు లక్ష్మీస్వరూపమని భావించినాడు. కాన నీ కుమార్తెను శ్రీనివాసున కిచ్చి వివాహము గావింపవలసినదని, ప్రస్తుతము కారణాంతరమున లక్ష్మికి దూరమయి శేషాద్రియందు వసించుచున్నాము. తాము ఇందుల కంగీకరించి లోకకల్యాణమునకు తోడ్పడవలసినదన సావధానచిత్తుండై వినుచున్న రాజు. అమ్మా! పెద్దలతో విచారించి మీకు కబురంపుదును. తప్పని సరిగా నీ కుమారునితో నా పుత్రి వివాహము జరిపింతునని

చెప్పి సకల రాజమర్యాదలతో వకుళాదేవిని సాగనంపెను. అప్పుడు ధరణీదేవి ఇమ్మెరుంగుబోడి పద్మావతికి కొంగ్రొత్త వలవంతలు రేకెత్తుచున్నవని, తన కుమార్తె బోయవానిపై మనసుపడి నీడులేని తోర్కుల నువ్విళ్లూరుచున్నదని గ్రహించి రహస్య మందిరమునకు కోడితెచ్చి ఇట్లనియె.

కీతమాలిక : చిలుకపలుకుల చిన్నారి చిట్టితల్లి
సోదిజెప్పిన మాటలే జోశ్యమయ్యె
దాప నెందుకు ఎదలోని తాపమెల్ల
యిచ్చవచ్చిన వానినే గ్రుచ్చిచెప్పు
నాతనికె నిన్నిచ్చియు పెండ్లిజేతుమమ్మ
చెప్పు నీలోని మర్మంబు చిన్నితనయ
లాతివారమే మాయమ్మ లజ్జపడగ.

వ॥ అనిన పద్మావతిట్లు నుడివెను.

తే.గీ. సిగ్గుసన భయాది ఖింకమ్ము లుగ్గడించి
బెగ్గడిల్లిన యుల్లంబు భగ్గుమనగ
వగపు చిడిముడి పాటుల వలపుతెరల
మేను పులకింప ధీమతి మేధలోడ
కాలు నేలరాయు చనియె కాంత యిట్లు
ధరణి! మాధవు వర్ణింప తరమె నాకు.

ఉ. చక్కదనంబునన్ మరుడు సాటికిరాడని చెప్పవచ్చు
యా
చక్కని నాసికాగ్రము ప్రశంసల నందిన
నూగు మీసముల్
చుక్కలలోని చందురుడు చొక్కుల చెక్కిలినొక్క
వానికన్
నిక్కము నిచ్చి నా మనము నీ దరిజేరితి కావుమమ్మరో

వ॥ అమ్మా! ఆ మధుసూదనుడు చిన్నినాడు చేసిన చిలిపి పనులు.

సీ. ముల్లోకములనెల్ల మోహింపజేసెనే
ముద్దుల క్రిష్ణయ్య మురళినూది
జలకేళి సవరించు జవరాండ్ర కోక లె
త్తుకపోయి చెట్టెక్కు దొడ్డవాడు
చల్ల లమ్మగబోవు గొల్ల భామల గూడి
సరసకు రమ్మనె సరసుడతడు
మన్నెల తిన్నావు మా యన్న నోరు చూ
పన చూపె నోటయు పదియునాల్గు

తే.గీ. భువనభాండంబులెల్లను భోగిశయను
డట్టి సుగుణాత్ముపై మనసు గట్టిదయ్యె
తాళజాలను అమ్మరో తగువుమాని
పెండ్లి జేయుము నన్నిచ్చి పేర్మిగూర్ప

వ॥ అమ్మా! వేయి జెప్పనేల.

తే.గీ. సోకు మాటల గొంగపై సోలె మనసు
నొల్ల నెఱుపంటి ధీరునే దుల్లమందు
అంబుదుల నివసించు నా హంసపిల్ల
కాల్వ జేరంగ గోరునే కన్నతల్లి.

వ॥ అమ్మా! నేనింతవరకు బయల్పరచలేదు కాని అబ లల కెందుకమ్మా యింత అన్యాయము

తే గీ. అమ్మ మగవాడు నచ్చిన కొమ్మగూడి
యిమ్ముగను పెండ్లియాడునే యింపుగాను
యించుబోణియు పురుషుని నిచ్చకొలది
కోరి పెండ్లాడ తప్పేల కోమలాంగి
కల్మషంబేల మాపట్ల కన్నతల్లి
అబల నబలౌను నిజమమ్మ నవనియందు

వ॥ ఆ విరాట్ స్వరూపుని విశ్వరూపము జూచినప్పటి నుండి నా మనం బతనికి అంకితమైనదన ధరణిదేవి పరమా నంద భరితురాలై తన కుమారుడైన వసుధానునితో రాజును పిలిపించి, పద్మావతి విషయము సవిస్తారంబుగా వివరింప రాజు సంతోషించి తన కుమారుని ఇంద్రలోకంబున బృహస్పతిని తోడితెమ్మని పంప, నతండు దేవలోకమునకు పోయి, బృహ స్పతిని తోడ్కొని రాజపురము వచ్చెను. అంత తమ్ముడగు తొండమానుని రప్పించి, శుకయోగీంద్రులను తోడ్కొని రమ్మన నాత డా శుకయోగీంద్రుల సత్వరంబున వెంట నిడు కొని వచ్చెను.

కం. వచ్చిన మునివరుల గని
ఉచ్చత మీరగ నరపతి యువిదను తోడై
యిచ్చతో వారిని గోరిరి
అచ్చపు కనకాసనంబు నాసీనులుగాన్

వ॥ కూర్చుండ నియోగించి వారి పాదంబులు కడిగి శిరంబునం దిడుకొని పన్నీరు చల్లి పుష్ప గంధంబుల పాదంబుల కడనుంచి, పూజించి వినయ విధేయ మానసుండై మునీశ్వరునితో రాజిట్లనియె.

ఆ.వె. కాంత ఒకతె వచ్చి కన్య మా కిమ్మని
రాయబారమాడె రాజెలంగ
వెంకటాచలాన వెలసియున్నారట
వేంకటేశుడంట వేల్పుడంట.

వ॥ స్వామీ! అంతకుముందు వేల్పుసాని యొకతె వచ్చి గద్దెం జెప్పి వెళ్ళినది. శ్రీ మహావిష్ణువునకు నీ కూతురు మనసిచ్చి కైంకర్యమయినది. రాజా! నీ భాగ్యమేమనవచ్చును. యుగయుగాల తపస్సు జేసినను దర్శనమీయని యా పుణ్య చరితుండు మీ కల్లుడౌట మీ మహాభాగ్యమేయని ఎరుకలసాని సోదిజెప్పి వెడలిపోయినది.

మ. కరుణాసింధులు మాకు పెద్దలు ఘనుల్
కాంతారవాసప్రియుల్
యెరుగన్ దేదియు లేదు ముజ్జగములన్ దేమేమి
కానున్నదో
మురళీధారియు సావిరాగలడె మా పుత్రిన్వరించర్తతన్
మరుగున్ బెట్టకు నిక్కమున్ దెలుపుమో మౌనీశ్వరా
వేడుమన్

వ॥ అనిరాజు వినయవిధేయుండై వేడుకొనగా నత యోగి కొంత తడ వాలోచించి మందహాసంబున నిట్లనియె.

ఉ॥ ఎట్టి తపంబుజేసితివొ యింతటి భాగ్యము కల్గె నీకు నీ
వెట్టిపనంబు లోకులకు నిచ్చితివో తొలిజన్మమందు! నీ
కిట్టి ఫలంబు గూడెను మునీంద్రులు గానని
భాగ్యమబ్బె నీ
గుట్టు నెరుంగనే హరికి కూతురు నిచ్చిన మామవైతివే

వ. ఆహా! ఏమి నీ భాగ్యము! రాజా! సమస్త జంతుజాలములకు తానే ప్రాణమై ప్రకాశించు నా విరాట్ స్వరూపుడే నీ కల్లుడాయెనా! హా స్వామీ! ఏమి నీ లీలావిలాస మేమని వర్ణింపదగును.

ఉ॥ నీవు యశోదబిడ్డవు పునీత మనంబున ముజ్జగంబులన్
ధీవర ధర్మకోపిదుల దీనజనాళిని మానిలోకమున్
కావగ జన్మ లెత్తుదువు కంజదళేక్షణ నీ విలాస మీ
సేవకా డే మెరుంగు! దయసేయవే! ముక్తిని భక్తి
గొల్చెదన్.

కం. వేంకటరమణుని గాథలు
హొంకంబుగ మననసేయ పోవును అఘముల్
సంకటము లెరుగ రెన్నడు
పంకజముఖి పద్మ యొసగు బాయని సిరులున్.

: గద్యము ;

యిది శ్రీ పరమేశ్వర కరుణా కవిత గుంజపల్లె వంశ గౌండ్ల
కుల వారాసి చంద్రుండు యీశ్వరభక్తుండు సంగీత సా
హిత్య దురంధరుండు సచ్ఛీలుండు యీడిగె యంగన్న
ధర్మపత్ని మంగమ్మగార్ల ప్రథమ పుత్రుండను
పురుషోత్తమగౌడు నామధేయుండ
కె.ఆర్. మద్దులేటి కవిగారి ప్రియ
శిష్యుండనగు నా ప్రణీతంబు
నందు చతుర్థాశ్వాసము
సంపూర్ణము.
ఓం

# పంచమాశ్వాసము

కం. హరిహరరూపా మాధవ
పురహర వందిత అనంత భుజగేంద్రధరా
సిరిమగడా నిను వేడెద
కరినేలిన రీతి కావు కారుణ్యనిధీ!

వ॥ అంత సూతమహామునిని శౌనకాది మహామునులు శేష కథావిశేషమ్ములు దెల్పగోరగా సూతుడిట్లు చెప్పదొడంగెను. శుకయోగీంద్రు డాకాశరాజును నీ వెంత పునీతుడవో యన అప్పుడాకాశరాజు బృహస్పతిని శుభలగ్నము నిర్ణయించమని యభ్యర్థించగా బృహస్పతీ విధముగా ముహూర్త మరయసాగెను.

ఉ. శ్రీయుత శ్రీనివాసుడ! యశేషధురంధర! రాక్షసాంతకా!
నీ యెనలేని లావుని నీ మహిమంబుల నెన్నుచుండె నా
కాయము సర్వ మంకితము శాగలదంచును పట్టుబట్టె నీ
వాయిత మెచ్చి పద్మను మహోదర మొప్ప వివాహ
మాడుమా!

వ॥ అని వధూవరుల జన్మ నామనక్షత్రబలంబుల నాధారంబుగా వేదజ్ఞులిట్లు ముహూర్తము నిర్ణయించిరి.

సీ. ఆకాశరాజు మీ కాదరంబున వ్రాయు
శుభలేఖ వినుమయ్య సుందరాంగ
వైవాహికములకు వైశాఖ శుద్ధ ద
శమి శుక్రవారం ప్రశస్తమంచు

నిర్ణయించ మహాసీయు లాజ్ఞ నరసి
కన్యార్పితముఁజేసి కాళ్ళుకడిగి
పెండ్లి జేయుంగ నే వేచియుందును బంధు
మిత్రాప్తు లెల్లరు మేలుగోరి

తే.గీ. సపరివారంబుగా వచ్చి సత్వరంబె
కన్య జేపట్టి వెంచేయు కమలనయన
వినుతిజేయంగ మాతోడ వియ్యమంది
సంతసంబున వేవేగ సాగరావె.

వ॥ అని బృహస్పతి లగ్నపత్రిక వ్రాసి ఆకాశరాజు కివ్వగా ఆకాశరాజు లగ్నపత్రిక వెంకటాచలము కొనిపోవు వారెవ్వరని విచారింప అందుకు సమర్థుడు శుకమహర్షియేనని బృహస్పతి వచించుంప, ఆకాశరా జిట్లనియె

తే.గీ. కాసనేయుని సత్పుత్ర మౌనినాథ
సత్యవాక్యాల సత్సంగ సాధుశీల
భక్తిపేరుదు శుభలగ్నపత్ర మంది
శ్రీనివాసుని కీయవె శీఘ్రగతిని

వ॥ అని ఆకాశరాజు శుకయోగీంద్రులను వేడుకొనగా శుకుండు ఆహా! ఏమి నా భాగ్యము! భగవంతుని వివాహ శుభలేఖ వార్తావాహన కార్యక్రమము మున్ను రుక్మిణీదేవి పంపున అగ్నిద్యోతుడను బ్రాహ్మణునకు లభించె. నేడు తమ మూలమున నాకు లభించినది. ఇంతటి యదృష్టము ఎంతటి తపోనిధులకు కలుగును! కాన నే పోయివచ్చెదనని పల్కి

హృదయ మానందతరంగంబుల నోలలాడ శీఘ్రగమనంబున శేషాద్రి వాసుడైన శ్రీనివాసుని కడ కేగెను.

తే.గీ. అంత శుకయోగి రాకను వింతగాంచి
సఫల మొనగూర్చ కార్యంబు సత్వరంబు
మౌని కెదురేగి యానంద మానసమున
స్వాగతంబిచ్చె నా శ్రీనివాసు డెలమి.

వ॥ అంత శ్రీనివాసుండు మహర్షిని ఉచితాసనంబున కూర్చుండ నియోగించి, అర్ఘ్యపాద్యాది పూజల నాచరించి, మహాత్మా! నీ రాక వల్ల మా జన్మ తరించినది. మీ బోటి మహాత్ముల నాగమనమున మా గృహము పావనమయ్యె. మీ రాకకు కారణమే ముండునో యన శుకయోగీంద్రుడు మీకు తెలియనిదేమి యుండును! సర్వాంతర్యామివయిన మీ రడిగి తిరి గాన చెప్పకతప్పదు.

తే.గీ: అనఘ తెల్పెద వినుమయ్య ఆదిపురుష
చెలిమి నాకాశరాజు నీ బలిమి వినియు
కూతునిచ్చు శుభతలంపు ఖ్యాతిగాను
నన్ను బంపెను నిను పిల్వ కన్నతండ్రి,

వ॥ స్వామీ! ఆ రూపురేఖలు, గుణములు వర్ణింప ఆది శేషునకైన తరముగా దనిపించును. ఆమెకు నామెయే సాటి.

కం. గుణనిధియగు పద్మావతి
గుణము లనేకంబు కలవు గోవింద యికన్
గణనీయమౌను మగువల
మణియై విలసిల్లె ధరను మంగళదేవా.

వ॥ మరియు నామె సందచందం బెట్టిదనిన.

తే.గీ. పాలమున్నీటి పట్టియు పినికిరాదు
సల్వగారాబు పడతియు నానపడును
గట్టు దొరపట్టి సొగసరి గిట్టదనగ
ముజ్జగంబుల నెనరాని ముద్దుగుమ్మ.

వ॥ అని శుకయోగి చెప్పి శ్రీనివాసులకు లగ్నలేఖనివ్వ శ్రీనివాసుడు ఇట్లనియె.

కం. వచ్చెద రామాపురముకు
మచ్చిక నా వన్నెలాడి మాలిని పద్మన్
మెచ్చగ ముల్లోకంబుల
కిచ్చగను పెండ్లి యాడ సమ్మతమనుమా!

వ॥ అని శ్రీనివాసుండు శుకయోగికి జెప్పి, సాగనంపి, చింతాక్రాంతుడై రాజుతో వియ్యమంద నా దగ్గర చిల్లిగవ్వ లేదని వగచుచుండిన సమయంబున.

తే.గీ. బ్రహ్మ మానసపుత్రుడు యిమ్ముగాను
కిన్నెరను మీటి పాడుచు తిన్నగ హరి
జేరి తాతగారేమిటో చింతజేయ
కారణంబేమొ తెలియంగ కానరాదు.

వ॥ సవినయంబున శ్రీనివాసునితో- నా యాగమనంబు తమ యాలోచన కంతరాయము కల్గించలేదుకదా! యన శ్రీని

వాసుడు తన మొత్తిపోడుపు మాటలకు చిరునవ్వునవ్వుతూ శిరము పంకించి సర్వమెఱింగించి ఎట్లైని ధనము వచ్చు నుపాయము తెల్పుమన నారదుం డిట్లనియె.

ఆ.వె. కొల్లగ ధనరాశి కూడబెట్టినవాడు
కలడొకడు కుబేరు డలఘునేత
గడ్డురోజుల కత డడ్డుకోగల దిట్ట
ధనము నప్పు నీయదగినవాడు.

వ॥ అని నారదుండు చెప్పిన యుదంత మాలకించి శ్రీనివాసుండు కుబేరుని రావించి

ఆ.వె. ఇయ్యవయ్య మాకు నిచ్చుతో ధనమును
వ్రాసియిత్తు నీకు పత్ర మనఘ
నలువ శంకరుండు నయమొప్ప సాక్షులు
యిత్తు యేటు వడ్డి యిచ్చుతోడ.

వ॥ అందులకు కుబేరుండు సంతసంబున సమ్మతించి శ్రీనివాసునితో పత్రము వ్రాయించుకొని వివాహార్థమై, ఒక కోటి పదునాల్గు లక్షల వరహాల ధన మప్పుగా నిచ్చి వెళ్ళిపోయెను. శ్రీనివాసుడు వలయు సకలవస్తువులగైకొని విశ్వకర్మను రావించి భవనములు ధర్మశాలలు, మణిదీపాలంకృత మందిరములను నిర్మింపుమనెను. మరియు సప్తలోకములవారికి శుభలేఖలునందజేయు కార్యక్రమమునకు గరుత్మంతుని నియోగించెను. అంత నా పన్నగవైరి సందరకు శుభలేఖలు పంచి వచ్చెను.

వ॥ అక్కడ ఫాలనేత్రుడు పెండ్లికిబోవ ప్రయాసంబగుచుండె.

సీ॥ గజచర్మమును మొలగట్టిగా జుట్టియు
కేలను మ్ముకనవాలు గేలుకొలిపి
బాలచంద్రుని సిగపై పువ్వుగా నుంచి
చంకన నొక చిన్ని జింక నిడియు
జడలోన గంగమ్మ జాలువారంగ నుంచి
నొసట విభూతియు పొసగబెట్టి
గండు జిల్వాల జంట మెండుగా ధరియించి
తలపుర్రె నెదపైని దండగట్టి

తే.గీ. మోమునందున చిరునవ్వు మొలకలెత్త
గట్టు దొర పట్టి తనవెంట బిట్టుగాను
గిత్తనెక్కి వేగజనె సత్కీర్తి గనగ
శ్రీనివాసుని పెండ్లికి చిత్తశుద్ధి,

వ॥ పార్వతీపరమేశ్వరుల వెంట వీరభద్రుండు, భృంగీశ్వరుండు, వినాయకుండు, కుమారస్వామి, ఇరుపక్షంబుల నడువభూత, ప్రేత, శాకినీ, ఢాకినీ పిశాచగణంబులు ముందు వెనకనడువ, నాకాశంబున చుక్కలలోని చంద్రుడు ప్రకాశించినట్లు పురాణదంపతులు శీఘ్రగమనంబున వెంకటాచలము జేర వారి కుచితస్థానముల విడిది గావించిరి, తదనంతరము.

తే.గీ. బ్రహ్మదేవుండు విశ్వ పరాత్పరుండు
హంసవాహను ముద్దుల నాలిగూడి
సంతసంబుగ విచ్చేసె సత్వరముగ
పెండ్లిజేయంగ తండ్రికి వేదవిధిని!

వ॥ ఇట్లు బ్రహ్మ వేంకటాచలము జేరెను.

తే.గీ. గండుమీరిన కరినెక్కి కౌతుకమున
ముద్దులొలుక శచీదేవి మోదమలర
వెంటనిడుకొని సురపతి జంటగాను
శ్రీనివాసుని పెండ్లికి శీఘ్రగతిని

వ॥ ఇంద్రుడు ప్రయాణంబయి రంభ, ఊర్వశి మొదలు గాగల అప్సరస గణములతో పాటు ఇంద్రలోక వాసులందరిని వెంటనిడుకొని వృషభాద్రి వెడలెను. తదనంతరంబు సమస్త దేవతలు, అష్టదిక్పాలకులును, నవగ్రహంబులును, కుబేరుడు, భరద్వాజ, గౌతమ, అత్రి, జమదగ్ని, శృంగి, శుకుడు ఇత్యాది ఋషిపుంగవులు, దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుషాది పుల్లోకవాసు లందరు శేషాచలమునకు వంచేయగా శ్రీనివాసుడు సూర్యుని పిలిచి నిట్లనియె.

ఆ.వె. పద్మబాంధవుడవు పరమ పవిత్రుడా
పతి విచారమైన పడతి పద్మ
నన్ను నిన్ను దప్ప నమ్మబోదెవరిని
వెంటదెమ్ము నామె వేగిరంబు

వ॥ అని శ్రీనివాసుండు జెప్ప సూర్యభగవానుండు వెంటనే పయనంబై కొల్లాపుర పరిసరప్రాంతంబున తపంబు జేయుచున్న లక్ష్మిచెంతకు బోయి నయవినయంబులతో కర కమలంబులు ముకుళించి ఇట్లనియె.

ఆ.వె. అమ్మ లక్ష్మిదేవి ఆదరంబుగ నన్ను
విష్ణు వంపె నన్ను విమలమతిని
తోడితెమ్మనియెను దూతనైవచ్చితి
రమ్మ సత్వరమ్ముగ మమ్ముగావ!

వ॥ అని చెప్పి బ్రహ్మ, ఈశ్వరుడు, యక్ష, గరుడ, కిన్నెర, కింపురుష, సిద్ధ, సాధ్య. చయ, మునిగణంబులతో నున్నారన లక్ష్మి సంతోషముగా నిట్లనియె.

గీ.మా. భర్త తనకెంత అపకార మూరుడైన
భర్త తన నెంత బాదిన పతిత పనిన
భర్త తనదారి రానివ్వ పొపివనిన
భర్తయే దైవమంచును బరగుచుండ్రు
భర్త యేదైన కష్టాలు బడుచునున్న
భార్య హృదయంబు భగ్గున బగులుగాన
భార్య విడువంగ తగదెందు భర్తకిలను

వ॥ అప్పుడు యమ తనూభవుండు లక్ష్మిదేవిని వెంట నిడుకొని నేరుగా వేంకటాద్రికి వచ్చెను. అక్కడ చెల్లెండ్రతో కోడండ్రతో, దేవగణంబులతో, మునిగణంబులతో, సన్మాన సత్కారములు పొందినదై, భర్తకు నమస్కరించి నిలువంబడ

భర్త ఆశీర్వదించి చేరతీసుకున్న వాడాయెను. తదనంతరంబు బృహస్పతి మహావిష్ణువునకు మంగళస్నానము చేయించమని చెప్పగా లక్ష్మీదేవి మొదలుగాగల ముత్తయిదువలు మంగళస్నానము చేయించి, సుగంధలేపనములు పూసి మంగళవాయిద్యములతో, భేరి మృదంగములతో గరుడారూఢుడై బంధువర్గంబుతో మార్గమధ్యంబున శుకయోగీంద్రుని ఆతిథ్యము తానొక్కడే స్వీకరించి సర్వదేవతలను సంతృప్తుల గావించి ఆకాశరాజు పట్టణమునైన రామాపురమునకు బయలుదేరెను. ఈ కథ ఇట్లుంటు అక్కడ ఆకాశరాజు.

సీ॥ పగడపు స్తంభాల బారులు తీర్చంగ
వజ్రాల పొదిగించె వైనమలర
పన్నీరుతో నేల కన్నియ లలుకంగ
ముత్యాలముగ్గులూ ముదముగూర్చ
జలతారు పందిళ్ళ కలమావితోరణ
జాలంబు చిత్రప్రసారమయ్యె
రచ్చలు క్రింతలు రాజమార్గంబుల
సరవి పొందెల నిల్పి రంటుగట్టి

తే గీ. కోడగోడల పూతలు పొటువముగ
రంగురంగుల కాంతుల రాజిలంగ
పసిడిమయమయి వెలుగు ప్రజ్వరిల్ల
పట్టణ వినూత్న శోభ గన్పట్టుచుండె!

వ॥ ఆకాశరాజు తన ముద్దులపాపకు వివాహమునకై చేయబడిన శృంగారవైభవములు వర్ణింపనలవిగావు. రామా

పురమంతయు చలువపందిళ్ళతో, పచ్చని తోరణములతో, మంగళవాయిద్య ఘోషారవంబుతో ఆకాశంబు ప్రతిధ్వనించు చుండె. శ్రీనివాసుడు సపరివారంబుతోవచ్చుచున్నట్లు చారుల వలన యెరిగినవాడై.

తే.గీ. పట్టపేనుంగు పన్నీట నద్దె కడిగి
మంచి ముత్యాలహార సమన్వితముగ
పట్టు పీతాంబరంబుల కట్టి పూల
దండల నలంకరించి రేదండమునకు

వ॥ అట్లు నలంకరింపజేసి పద్మావతితో తానునూ గజారూఢుడై పురోహితసహితంబుగా పుర బాహ్యప్రదేశంబునకు తన ముద్దులబిడ్డను శ్రీనివాసునకు పునర్దర్శనంబు జేయించి, పద్మావతిని శ్రీనివాసులను గజారూఢులన్ గావించి, పురప్రవేశంబు జేయించి రాజవీథులయం దుత్సవోపేతంబుగా త్రిప్పుచుండ పెండ్లి సంబరాలంబరంబు నిండి ప్రతిధ్వనింపసాగెను.

సీ॥ పురవీథులందు నా పుణ్యాంగనల్ పుష్ప
వర్షము గురిపింప హర్షమునను
ముత్తైదువల్ భక్తి ముంగలి నిల్చుండి
ముదమార సేసలు ముచ్చటిడిరి
వందిమాగధులు కైవారంబు పల్కంగ
దాసదాసీజనుల్ తరలిరాగ
ఛత్రాజులెల్లరు బహుపరాకనుచుండ
అప్సరాంగనలెల్ల ఆటలాడ

తే.గీ. ఇంత మంచి దాంపత్యంబు ఎంతవారి
కబ్బు! పురజను లబ్బితబ్బిబ్బులైరి
బ్రహ్మలిఖితంబు దప్పింపరాదు నంచు
వినుతి జేసిరి ముదమున విజ్ఞులెల్ల.

వ॥ పురమంతయు మహానంద విలాసంబుల చిందులు ద్రొక్కుచు గంతులు వేయుచు వధూవరులను కల్యాణమండపము దరికి తోడితెచ్చి వజ్రవైడూర్యమరకతమాణిక్యరత్నాల ముత్యాలాదుల సమర్చబడిన పందిర్లయందు వారికి విడిది గావించిరి.

తే.గీ. సూర్యు డస్తమించంగనె జోకలుడగె
దట్టమగు చీకటి పొడమె తారలుబ్బె
జారచోరుల కనుకూల కారుమబ్బు
కన్నులుండి ఈ ప్రకృతి గానరైరి.

వ॥ అట్టి సమయంబున పెండ్లిపెద్దలెల్ల.

ఆ.వె. కాళ్ళ గోళ్ళు తీసి కన్యామణికి పెండ్లి
కొమరునకును తలల చమురురాసి
నలుగు లిడగజేసి నయమొప్ప నడిరేయి
జలకమాడి రంత జంటగూడి.

తే.గీ. పుడమి క్రొత్తవెల్గుల పట్టుపుట్టములను
బిట్టుగా ధరియించియు బిడియమొప్ప
పెండ్లితూతుదు జేసిరి ప్రేమలలర
పెద్దలకు నెల్ల మ్రొక్కించి రేపవిదిని.

వ॥ తదనంతరంబున.

ఆ.వె. శ్రీనివాసునకును చీనిచీనాంబరాల్
ప్రీతితోడ కట్టి పెండ్లికొమరు
జేయ పెండ్లిపీట జేర వధువువచ్చె
నపుడు వలపులొలుక నలుకతోడ.

వ॥ అంత పులుగులు కూసె చుక్కలు మాసె. గ్రుడ్డు కాన్పులు గూళ్ళు విడిచె. మన్మధుండు విల్లెత్తుకుడించె. మన్మ దారుల మన్మదతాపంబులు తనివిదీరక ఇను డుదయించెనే యని మానసంబులు వికలంబులయ్యె. కోయిలలు కూసె. నీల కంఠంబులు పురివిప్పి సూర్యభగవానునికి కైవారంబు జేయు చుండె. కాకులు అరవసాగె. తూర్పుదిశన అగ్నికుండమన అరుణ కిరణంబులు ప్రసారమగుటకు పురజనులెల్లరు విహిత ప్రకారంబుగా కాలకృత్యంబులు దీర్చుకొనిరి. ఉద యాద్రిపై ఎర్రటికాంతి సింధూరపుముద్దయనగ సూర్యు డుద్భ వించె. భూసురులంత సామవేద వాక్యంబులు నుడువుచు సూర్యునకు ఆర్ఘ్యపార్ఘ్యంబులిడిరి. అట్టి సమయంబున పద్మా వతి, శ్రీనివాసులను పెండ్లిపీటల కడకు తోడితెచ్చిరి.

తే.గీ. పలు తెరంగుల వాద్యముల్ పలుకుచుండ
దివ్వెటీ లెల్ల దిక్కుల దీప్తి మెరయ
వధూవరులను పెండ్లితిన్నెవద్ద నిలిపి
పెండ్లిపీటల కూర్చుండబెట్టి రపుడు.

వ॥ తదనంతరంబు నిగమ విహిత ప్రకారంబుగా శ్రీని వాసుడు కాశీయాత్రకు ప్రయాణంబై పోవుచుండ ధరణీదేవి గూడి ఆకాశరాజు శ్రీనివాసున కడ్డంబువచ్చి చేతులు బట్టు కొని- నాయనా! నీ విపుడు కాశీయాత్రకు బోవ నవసరము లేదు. నీవు పెండ్లిచేసుకొని కొంతకాలము సంసార సుఖము లనుభవించి గృహస్థాశ్రమమున పురుషార్థముల నిర్వహించి రాజయోగీంద్రుడవై పిదప వానప్రస్థాశ్రమ మవలంభించి పుట్టుక-చావు లేని త్రోవ వెదకవలెను. కాన కాశీయాత్ర మానుము. మా సుకుమారి కుందనపు బొమ్మ నీ కిచ్చి పెండ్లి జేతుమన శ్రీనివాసుం డంగీకరించెను.

తే.గీ. ప్రియసతి జలధారలిడగ ప్రేమమీర
కాళ్ళు గడిగె నాకాశరా జొళ్ళుమరచి
కన్య నర్పించి లోకైక గరిమలొప్ప
శ్రీనివాసుని మెప్పించె చిత్తశుద్ధి

వ॥ తదనంతరంబు.

తే.గీ. పుడమివేల్పులు తొలిపల్కుల్ నుడువుచుండ
పెద్దలెల్లరు దీవనల్ ప్రేమనొసగ
పట్టు పుట్టు మట్టుతెరగ పట్టుజేసి
సేసలును జల్లి కార్యోక్క జేసిరపుడు

వ॥ తదనంతరంబు నా చెలులును

సీ॥ ముత్యాలకంబళి ముదమారగా నేసి
రత్నాలతో నింపె రమణి యొకతె
పసిడి సేసల దెచ్చి పళ్ళెరంబులనుంచి
ముత్తియంబులనందు ముచ్చటిడియు
నలువరాణిని గూడ నయమొప్ప గూర్చుండ
నెలకాల్పు సతిగూడి నెరయుచుండ
నేలరేడులు తమ నెలవుల గూర్చుండ
చేయిచేయిని గలిపి చెలిమితోడ!

తే.గీ. అడ్డుతెర దీయ కనుదోయి కట్టులేక
మగువచూపులు వరుపైన తగులుకొనెను
వరునిచూపులు వధువుపై నొలుకబోయ
వొండొరుల కనుదోయికి పండువయ్యె.

వ॥ అత్తరి నా పుత్తడి దువ్వలు సదాలుపు చిత్తంబు
కొత్త వలవంత లువ్విళ్ళూరుచుండ.

ఆ.వె. ఒజ్జల సముదాయ మోంకారరాగాలు
మంత్ర ముచ్చరించు మహిమలరసి
కప్పై తాళిబొట్టు కల్యాణి గళమున
శ్రీనివాసుడపుడు చిత్తమలర

తే.గీ. పాడిరపుడు గంధర్వులు ఆడిరంత
రంభ ఊర్వసి వలపుతో రాణజెలగ
చల్లిరి విరుల నప్పుడు కొల్లలుగను
వధూవరులపైన వాంఛతో భక్తితోడ.

పంచమాశ్వాసము

వ॥ అంత వధూవరులు

కం. సన్నపు ముత్యము లెలమిన్
కన్నియ తలమీదఁ బోయ కాంతామణియున్
వెన్నుని తలపై బోయగ
కన్నుల కింతయ్యెనపుడు కమనీయముగాన్.

వ॥ అంత వధూపతులు తలంబ్రాలు ఒకరిపై నొ
పోయుచు పరమానందంబున నుండిరి.

తే.గీ. ఒండొరుల చెరగుల ముడి గండు బిగియ
పడతి చిటికెన వ్రేలును పట్టజేసి
జోకక్రొత్తజంటుకు పరంజ్యోతి జూపి
మ్రొక్కజేసి రాలుమొగల ప్రక్కనిలిపి.

వ॥ అంత ఆకాశరాజు

సీ. అపరంజి కిరీటాలు అంగుళీయంబులు
పట్టుపీతాంబర వస్తుచయము
కర్ణకుండలములు కవచాలు ఖడ్గాలు
కనక భూషణములు కాంతులీన
రత్నాల హారాలు ముత్యాల మురుగులు
మత్తేభముల నాలమంద లాది
బంగారుపాత్రలు రంగారు రథములు
రత్నకంబళ్ళను రక్తినొసగె

తే.గీ. సొమ్ము లెన్నెన్నొ జతగూర్చి నెమ్మిగాను
పద్మ కిచ్చెను బంగారు పాదుకలను
వజ్ర బాపల కెల్లను వలయునంత
లచ్చినిచ్చి వలువలిచ్చె నిచ్చతోడ.

వ॥ ఈ విధముగా ఆకాశరాజు తనఅల్లుడైన శ్రీనివాసునకు తన ముద్దులకూతురు పద్మావతీదేవికి అరుణంబుల నిచ్చి భార్యాభర్తల నొకటిగా జేయదలంచి వారిని శృంగారింప దలచి.

తే.గీ. అలరు స్వర్ణాసనంబు లందాలు మొగల
నిబ్బరంబుగ కూర్చుండనిడగ జేసి
పాటలుపాడి పేరంటాలు పాటవమున
స్నేహశీలత శిరముల సేసలిడిరి.

వ॥ తదనంతరంబున ఆకాశరాజు ఆలుమగల నొకటి జేయదలంచి.

సీ. బంగారుమంచాన రంగారువిరులతో
శృంగారముల దీర్చె చేడెయొకతె
రంగురంగులు వేసి రంగవల్లుల దీర్చి
విరిపాన్పు సరిచేయు గరిత యొకతె
పన్నీటిబుడ్డులు పాలకొబ్బరిగిండ్లు
పండ్లు పాలును బెట్టు పడతియొకతె
మంచిగంధంబు తీసి మధురసంబులనుంచి
నిలువుటద్దము నిల్పె పొలతియొకతె

తే.గీ. అలరు తాంబూలముల సున్న మత్తరాది
పచ్చ కర్పూర జాపత్రి నిచ్చగూర్చి
తుంట విలుకారి పనికయ్యె యింటజంట
నుండగను జేసి రిచ్చతో యువిదలెల్ల.

వ॥ అపుడు శ్రీనివాసుని శోభనంబు గదియందుం పద్మావతిని శృంగారించి చెలికత్తెలు పద్మావతితో నిట్లనిరి.

తే.గీ. అమ్మ మును నీవు గోరిన అందగాడు
తుంట విలుకారి పనికయ్యె జంటకొరకు
నిబ్బరంబుండ నొల్లక నివురుచుండె
తడవుజేయకు మమ్మరో తలరిబోడి.

తే.గీ. మిక్కుటంబగు ప్రేమతో పిక్కటిల్ల
యింతపనుక బుచ్చితి కాల మిగురుబోడి
మగని సజ్జకు బొమ్మన్న మంకులేల
రాగరంజితు డరిజేర లజ్జపడకు.

వ॥ అమ్మా! పద్మావతీ!

సీ. చెలికాడు రమ్మని చేరదీసిన వేళ
మార్మోగంబున ప్రక్క మరలకమ్మ
వగకాడు మెదకొంగు వలపుతో సడలింప
గడుసుతనంబున బెదియకమ్మ

మరునయ్యె మనసార మంచిగంధము పూయ
మారుమాటాడకో మందగమన
వెన్నుడు కపురంపు విడియమిచ్చిన వేళ
వినయహీనతచేయి విసరకమ్మ

తే.గీ. సొగసుకాడు నీ కేల్పట్టి యెగసి నీదు
జుంటుతేనియ గ్రోలంగ చొరవనిమ్మ
తుంటవిల్తుటండ పనుల తుప్పటిల్ల
పిలువ! జాగు సేయకుమమ్మ కలువకంఠి.

తే.గీ. బిడుత మామీద కోపంబు నిడగరాదు
మంచి చెప్పిన మమ్మేల కించపరతు
భర్త కౌగిలి ముందిట్టి భామలెల్ల
నలిగి గడిదేరి ప్రౌఢలై మెలగుచుంద్రు

వ॥ అని చెలికత్తియలు పద్మావతిని పడకటింటికి తోలుకొనిపోయి మగువచేత విడియంబు వరునికి, వరునిచేత విడియంబు వధువుకు నిప్పించి శ్రీనివాసులతో చెలికత్తెయలు ఇట్లనిరి.

ఆ.వె. ముద్దుగుమ్మ నీదు ముంగిట నిల్చెను
అందగాడ నీవు డెందమంది
పొందగోరునట్లు పొలతుకధరినంటి
వలపులొలుక మెలగు నెలతగూడి.

పంచామాశ్వాసము

ఆ.వె. మాట గడుసుకాని మనసుమంచిది సుమ్మి
దక్కె నీకు ఇంతి ధరణిజాత
వేగిరంపు పనుల విసిగింప బోకుము
ముద్దుగుమ్మ నెమ్మి దిద్దుకొమ్ము.

తే.గీ. చెప్పవలసినవారమై చెప్పినాము
గాని శ్రీ వేంకటేశ యేకాంతమునను
నచ్చినతెరంగు పడతి నిన్మెచ్చునటుల
తుంట విలుకారి పనుల సంతృప్తిపరచు

వ॥ అంత పద్మావతిని పడకింట విడిచి చెలికత్తియ
తలుపులు బిగించి వెళ్ళిపోవగ.

తే.గీ. వెన్నుడు చిరునవ్వు లొలుక కన్నియ చెయి
పట్టి సెజ్జకడకు ద్రోసి పడతిచుంచు
దువ్వి! వలపులు గ్రుమ్మగ దుక్కి కొన్ని
వన్నె దిద్దుచు సనియెను వలపులొలుక

సీ. సన్న పుత్తియముల సరులను సవరించు
నెపమున చనుదోయి నట్టు కేల
చెవుల కమ్మలుఁ జక్కజేయు నెపంబున
చెలికాడు చెలిమిని చెంపలంటు
పలుప చక్కగ దిద్దువలనుగ కన్నట్టి
పగకాడు పిరుదుల పత్తినిమరు
కపురంపు విడెమొసగను బోవులాగున
ముగుద చక్కెర మోవి ముద్దులాడు

తే.గీ. పువ్వులు సిగలోన బెట్టెడి పొలుపెలర్ప
ముట్టరానట్టి నంగముల్ ముట్టిచూచి
మెల్లమెల్లన యొక్కింత యుల్లమలర
ఇంచు విలుకాల్చు కార్యంబు నెంచుకొనియె

వ॥ ఇత్తెరంగున పుత్తడి దువ్వాలువవాల్పు రేయెల్ల తత్తరపాటేమి లేక పుత్తడిబొమ్మతో గూడి కోర్కులు వెలయంగ కౌగిటజేర్చి నా చిలుకల కొల్కి చన్నుదోయిపై కరం బిడి కసిదీర దొండపండువలె కన్పట్టు పెదవుల నొక్కి గిలిగింతలు బెట్టి తల నిమురుచూ కలువకంటి మనంబు కరుగం జేసి తుంట విలుకాని పనులతో దంటయై ఇచ్చవచ్చిన తెరంగున నెచ్చెలి గూడి గుడుసువాలు వాలుపు రేయెల్ల గడుపు చుండ తదనంతరంబున ఒకరోజు శ్రీనివాసుం డేకాంతంబు నున్నపుడు మహాలక్ష్మి దరిజేరి నమస్కరించి యాక్రోశమున నిట్లనియె.

తే.గీ. ఇష్ట చరితులు లోకాల నుద్ధరింత్రు
పెద్ద లీకీతి నిరతంబు హద్దుమీరి
బుద్ధిహీనత మెలుగ దుర్బుద్ధిగాదె
అద్దిరా ఆలి యుండంగ ఆలి తగునె.

వ॥ నాథా! ఇదియేనా మీ లోకపాలన! ధర్మ రక్షకుం డవు నీవే నీతికి దూరమై ఇట్లు ప్రవర్తించిన లోకులు మంచి మార్గంబున నెట్లు చరింతురు? మీ కొరకు తపంబుజేయుచున్న ఇల్లాలినైన తలంపక వేరొండు కన్యను పరిణయమాడి కులుకు చుండుట న్యాయమా!

ఆ.వె. నమ్మి చెడెను గాదె నాతి జీవితమెల్ల
వీట గాచుట పంతమెన్నొలోతె
పుచ్చుబడై పూర్వ పుణ్య పురాణాలు
నీతిలేని పురుషజాతివలన

వ॥ ఇన్నిదినంబులనీకై ఎదురుచూచి కన్నులుకాయలు గాచినవి. కాని నీ పరిస్థితి ఇప్పుడర్థమయినది ఇక నాకు ప్రాణత్యాగంబుకన్న శరణ్యంబు లేదని కన్నీరుగార్చుచు వగచుచున్న లక్ష్మిని చేరదీసి, లక్ష్మీ ! అకారణంబుగా నన్ను నిందించుచు, నిన్ను నీవు నిందించుకొనుచున్నావు గాని వేరొండుగాదు. వినుము. నీ కొక పూర్వజన్మ వృత్తాంతము చెప్పెద ననుచు వేదవతి జన్మవృత్తాంత మిట్లు వివరించెను. సీతాదేవితో శ్రీరామచంద్రుడు అరణ్యంబునకు బోవటము, సీతను రావణుడు అపహరించుకొని బోవటము, అగ్నిదేవుడు నిజమైన సీతను తనదగ్గర యుంచుకొని మాయసీతను రావణునకు అప్పగించడము, శ్రీరాముడు రావణుని జంపుటయు వేదవతి అగ్నిప్రవేశము చేయుటయు, అగ్నిదేవుడు నిజమైన సీతను శ్రీరామున కప్పగించుటయు, సీత తనకై కష్టపడిన వేదవతిని పరిణయమాడుమని శ్రీరామునితో జెప్పుటయు, అందుకు శ్రీరాముడు సమ్మతించక నేను కలియుగంబున వేంకటేశ్వరుండ నవుదును. ఈ వేదవతియే పద్మావతియై జన్మించును. అప్పుడు నేను పద్మావతిని పెండ్లియాడుదుననియు ఆ వేదవతియె ఈ పద్మావతియని యెరింగించెను. లక్ష్మీదేవి స్వామీ! అతివనై నేను ఎరుకమరచితిని, క్షమించు మన శ్రీనివాసుడు పరిస్థితుల ప్రభావమున అట్లు జరిగినది. కాని నీ వేద

యినా అన్యాయము చేయతేదని శ్రీనివాసుండు చెప్పి లక్ష్మిని శాంతించుమని కోరెను. మరియు నా వివాహమునకు కుబేరుని వద్దర అప్పుగా బోలెడు సొమ్ము తీసుకున్నాను. దానికి నీ సహాయము గావలయును. భక్తులు నన్ను సేవించుటకై వత్తురు. వారికి విపరీతమైన ధనమిచ్చినచో వారు అమితమైన పాపకృత్యంబులు జేసి నన్ను శరణుగోరి నాకు వలయునన్ని కానుకలు అర్పింతురు. దానంజేసి నేను కుబేరునకు వడ్డిగట్టి అప్పు తీర్తునన లక్ష్మీదేవి శాంతించి తిరిగి శ్రీనివాసుని వశము జేరెను. అప్పుడు శ్రీనివాసుండు పద్మసరోవరంబున లక్ష్మికి విశ్వకర్మతో దివ్యమందిరము నిర్మింపజేసెను. అంతఃకలహము లంతమయ్యెను. శ్రీనివాసుండు లక్ష్మిపద్మావతులతో సుఖముగా నుండెను.

ఆ వె. వేంకటేశు గాథ వినగ జెప్ప చదువ
సంకటంబు తొలగు స్వామి కరుణ
పద్మ సిరుల నిచ్చు భవభయంబుల బాపు
నాత మిచ్చు మీకు నమ్మి కొలువ!

తే.గీ. మంగళం వేంకటేశ్వర మమ్ము కావు
మంగళం బిడె అలివేలుమంగ నీకు
మంగళం మద్దులేటి విమానస్వనపును
మంగళం మన భారతమాతః కిప్పుడు.

: గద్యము :

యిది శ్రీ పరమేశ్వర కరుణా కవిత గుంజపల్లె వంశ గౌండ్ల
కుల వారాసి చంద్రుండు యీశ్వరభక్తుండు సంగీత సా
హిత్య దురంధరుండు సచ్చీలుండు యీడిగె యంగన్న
ధర్మపత్ని మంగమ్మగార్ల ప్రథమ పుత్రుండను
పురుషోత్తమగౌడు నామధేయుండ
కె.ఆర్. మద్దులేటి కవిగారి ప్రియ
శిష్యుండనగు నా ప్రణీతంబు
నందు పంచమాశ్వాసము
సంపూర్ణము.

ఓం శ్రీ గురు పరబ్రహ్మణమస్తు.
పద్మావతీ పరిణయము సంపూర్ణము.
ఓం

---

27 వ పేజీ 18 వలైను
ఉండ నీడ నిచ్చె నుత్కృష్ట బుద్ధితో
అని చదువు కొనవలెను.

PADMAVATHI PARINAYAM



This book is published with the financial assistance of Tirumala Tirupati devasthanams under their scheme aid to publish religious books



AKA PRINIERS OLD GUNIUR - 522 010
Phone. : 20144 p. p.